# ఏకవ్యక్తి సైన్యం



**మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు)**

జననం : **04-12-1955**

మరణం : **28-02-2022**

**మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) స్మారక వేదిక.**

**పిఠాపురం**

# విజ్ఞులైన పాఠకులకు విజ్ఞప్తి

మంచి మనిషి, మానవతావాది, ప్రజల మనసుల్లో పదిలమయిన స్థానం ఏర్పర్చుకున్న ఫ్రీలాన్స్ జర్నలిస్టు, సోషల్ యాక్టివిస్టు, పర్యావరణ ప్రజా ఉద్యమకారుడు, అందరూ బాంబు అని ప్రేమగా పిలుచుకునే శ్రీ మేకా సత్యనారాయణ శాస్త్రి గతించి ఏడాది. ఈ సంవత్సర కాలంలో చాలా మంది లాగానే మా కుటుంబానికి కూడా ఆయన లేరన్న దుఃఖం నుండి తేరుకోవడానికి సమయం పట్టింది.

అన్ని వేళలా అభయాన్నిచ్చే ఒక భరోసాను అకస్మాత్తుగా కోల్పోయిన భావన స్వయంగా మేం అనుభవిస్తూనే ఉన్నాము. అయినా, కాలం తనదారిన తాను సాగుతూనే ఉంటుంది కాన ఆయన స్ఫూర్తితో నెట్టుకెళ్ళడమే కర్తవ్యంగా తలచి ఆయన గురించి అక్షరాల్లో వ్యక్తమైన అనేక అభిప్రాయాల్ని ఇదిగో ఇలా చిన్న పుస్తక రూపంలో మీ ముందుకు తీసుకువస్తున్నాం.

అంతులేని ప్రేమాభిమానాల్ని ఆయన పై కురిపించేంత మంది అభిమానులు,మిత్రులు,బంధువులు ఉన్నారని మాకు తెలుసు. ఐనప్పటికీ, సమయాభావ సమస్య, అలాగే సమాచార లోపం వలన ఎందరెందరో ఆత్మీయుల విలువైన అభిప్రాయాలకు, ఇందులో చోటు కల్పించలేక పోయాం. అందుకు క్షంతవ్యులం. వివిధ సాంకేతిక కారణాల వల్ల , అలాగే అసలు పుస్తకంగా తేవాలా వద్దా అనే మీమాంస వల్ల చివరి క్షణం వరకూ ఇదిలా వస్తుందని మేమనుకోలేదు.

అయినప్పటికీ, ఎన్నో అవాంతరాల్ని అధిగమించి ఇదిలా రావడానికి సహకరించిన అందరికి పేరుపేరునా హృదయపూర్వక ధన్యవాదాలు. హడావుడి పెట్టినప్పటికీ వారి భావాల్ని పంచుకున్న హితులూ, ఇదిలా రూపొందడానికి కారకులైన శ్రేయోభిలాషులకీ, సాంకేతిక సిబ్బందికీ కృతజ్ఞతలు. ఇందులోని లోపాల్ని, మార్పులు – చేర్పుల్ని సూచిస్తే భవిష్యత్తులో సరిచేసి మలి ముద్రణలో మరింత సమగ్ర పర్చడానికి శాయశక్తులా మా వంతు ప్రయత్నం చేస్తామని మనవి చేస్తూ, సెలవు.

**మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) స్మారక వేదిక,**

**పిఠాపురం , కాకినాడ జిల్లా.**

# ఏక వ్యక్తి సైన్యం

## మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు)



ఉత్తరాంధ్రలో పుట్టాడు. ఉద్యోగం కోసం ఎక్కడెక్కడో తిరిగాడు. ఎన్ కౌంటర్ పత్రిక వ్యవస్థాపకులైన ఇద్దరిలో ఒకడు. తరువాత ఏకంగా దశరథరామ్‌తో విభేధించీ 'ఎన్కౌంటర్ దశరథరామ్ బండారం' పుస్తకం రాసి దుమారం రేపినవాడు. లెక్కలేనన్ని పత్రికల్లో పనిచేసినా ఫ్రీలాన్స్ జర్నలిస్టుగానే చెప్పుకునేవాడు. నిఖార్సైన పాత్రికేయుడిగానే నిష్క్రమించినవాడు, బాంబుగా అందరికీ తెలిసిన మేకా సత్యనారాయణ శాస్త్రి!

లా చేసాడే కానీ అబద్దాలు చెప్పాల్సి వస్తుందని లాయరవలేదు. రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రికి అత్యంత సన్నిహితుడిగా మెలిగి, రాజకీయాలలో నిలదొక్కుకునే అవకాశం ఉండి కూడా రాజీపడే మనస్తత్వం లేక మౌనంగా తప్పుకున్నాడు. అనేక సంక్షోభాల చట్రాలలో తానెవరి పక్షమో తేల్చుకోడానికి తప్పటడుగులు వేసిన సందర్భాలకూ కొదవలేదు. అయినప్పటికీ చివరి దాకా ధైర్యంగా నిలబడ్డ విలక్షణ వ్యక్తిత్వం ఆయన సొంతం!

ప్రజాపక్షంగా హై కోర్టులో కొన్ని వందల ప్రజాహిత వ్యాజ్యాలు వేసాడు. చిన్న కోర్టుల్లో అయితే లెక్కేలేదు. మద్యపాన వ్యతిరేక ఉద్యమం మొదలుకొని మానవతావాద ఉద్యమం వరకూ ఎన్నో సంఘటనల్లో పాల్గొన్నాడు. ప్రజాపక్ష సామాజిక కార్యకర్తగా మూడు సార్లు ఆమరణ నిరాహార దీక్ష చేసాడు. చనిపోవడానికి రెండు నెలల ముందుకూడా త్వరలో ఆమరణ

నిరాహారదీక్ష చేస్తున్నట్లు ప్రకటించి తరువాత అనివార్య అనారోగ్య కారణాల వల్ల విరమించుకొన్నారు. పర్యావరణ కార్యకర్తగా అభివృద్ధి పేరుతో బడా కార్పొరేట్ కంపెనీల ఆక్రమణలకి వ్యతిరేకంగా నినదించాడు !

ప్రతి పబ్లిక్ హియరింగ్‌లోనూ ఆయనదొక బలమైన ధిక్కార గొంతు. ప్రతి ప్రజాతంత్ర పోరాటంలోనూ ఆయనది కీలకమైన ప్రజాస్వామిక స్వరం. విభేధాలు, వివాదాలు ఎలాగూ ఉంటాయ్ కానీ జీవితాంతం తాను నమ్మిన విలువల కోసం ఉద్దేశించిన మార్గం, అదెంత కష్టమైనదైనా తదేకంగా నడిచిన ఆయన ఎందరికో స్ఫూర్తి!

మనుషులంటే ఇష్టపడేవాడు, మమతలంటే ప్రాణమిచ్చేవాడు, చివరిదాకా అందరితో ఆత్మీయంగా కలిసిమెలిసి జీవించడమే జీవిత పరమార్ధం అని భావించినవాడు, ఎవరికి ఏ ఆపద వచ్చినా నేనున్నానంటూ ముందుకు వచ్చేవాడు, 'బాంబు' గా అందరికీ తెలిసిన మేకా సత్యనారాయణ శాస్త్రి మరణం ఒక తీరని లోటు !

బతికుండగా ఆయన వద్ద శిష్యరికం చేసిన ద్రోహులే డబ్బు కోసం వెన్నుపోట్లు పొడిచినా నవ్వి ఊరుకున్న ఉన్నతుడాయన. ఎంతో మంది ఆయన పేరు చెప్పుకుని దందాలు చేస్తూ, దండుకుంటూ కూడా ఆయన్నేదో తామే పోషిస్తున్నట్లు కపట నటనలు చేసినా ఎన్నడూ పట్టించుకోని పిచ్చివాడు. అందరూ మనవాళ్ళే అనుకుని చివరికి గడ్డి కరిచేందుకు సిద్ధపడ్డ మిత్రుల చేతే చాతకానివాడుగా చూడబడ్డవాడు. నిజంగా అందరినీ తన వాళ్ళుగా ప్రేమించిన పిచ్చివాడు...!

ఈ రోజు ఆయన లేడు, ఆయన నడిచిన దారి ఉంది. ఆయన పేరు చెప్పుకున్నా, లేకున్నా కూడా సిగ్గులేకుండా ఇక ఏ దారీ లేక ఆ దారే గతని అందులోనే నడుస్తున్న బడుగ్గాయిల బతుకులు ఆయన నీడలోనే తెల్లారతాయ్. జీవితాంతం ఆస్తులు, అంతస్తులు, గోదారిలో ఇళ్ళూ, రాదారి పక్కన బంగళాలు కట్టుకుని సైతం కంటి మీద కునుకు లేకుండా బతుకీడ్చే ఏడుపులు,

ఎంత ఉన్నా ఎప్పుడూ పేదరుపులు అరిచే గొంతులూ, అత్యంత సుఖంగా ఆయన్ని వరించిన మరణం సాక్షిగా మొద్దుబారిపోయారు. అప్పటిదాకా చేస్తూ వచ్చిన దుష్ప్రచారాల సాక్షిగా కొయ్యబారిపోయారు!

ఎలాంటి మరణం అది. క్షణంలో చనిపోవడం. నిద్రలోనే తనువు చాలించడం. పోతున్నట్లు తెలియకుండా పోవాలనే ఆయన కోరిక కూడా చివరిగా నెరవేరడం. ఆయన గురించి తెలిసిన అభిమానులకి అదెంత సంతోషకర విషయమో, కపట భక్తితో ఆయన పై అవాకులూ, చెవాకులూ ప్రచారం చేసిన వారికి అంతే బాధాకరమైన విషయం. వాళ్ళే ప్రచారం చేసినట్లు, కాలం ఎవరి పక్షమో బాంబు మరణం రుజువు చేసింది. అంతటి మహోన్నత మరణం మహానుభావులకే చెల్లింది, మైండిట్!

మద్యపాన వ్యతిరేక ఉద్యమం మొదలు మూఢనమ్మకాల నిర్మూలన దాకా, హేతువాద ఉద్యమం మొదలు పాత్రికేయుల రక్షణ వరకూ పర్యావరణ పరిరక్షణ నుండి అక్రమ పశు రవాణ నిరోధం దాకా , పోలీసుల ఆధిక్యత నిరోధం నుండి ప్రజాతంత్ర రాజకీయ విధానాల వరకూ ఆయన ఒక ప్రశ్న. ప్రశ్నించడమే ప్రజాస్వామిక విలువలని బతికిస్తుందని నమ్మినవాడు. అలా ప్రశ్నిస్తూనే జీవించాడు, ప్రశ్నిస్తూనే మరణించాడు!

**వ్యక్తులు మరణించొచ్చు కానీ ప్రశ్న ఎప్పటికీ మరణించదు. కాబట్టి, ప్రశ్నించడమే ఆయనకి మనం ఇవ్వదగ్గ నివాళి!**



# నాన్నా - నేనూ - అక్షరం !

–గౌరవ్

"జర్నలిస్టువైనందుకు గర్వపడు మిత్రమా, భయపడకు, భయపడుతూ వ్యక్తిలా బ్రతికుండవచ్చు కానీ, జర్నలిస్టుగా చచ్చిపోవడానికయినా సిద్ధపడితేనే జర్నలిజంలో ఉండు!"

ప్రపంచ ప్రసిద్ధ నోబుల్ శాంతి పురస్కారాన్ని రష్యా, ఫిలిప్పీన్స్ దేశాల్లోని ఇరువురు జర్నలిస్టులకు ఇచ్చినందుకు 'జర్నలిజానికి అత్యున్నత పురస్కారం' పేరిట FBలో స్పందిస్తూ " ప్రపంచ జర్నలిజం చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగ్గ సంఘటన ఇద"ని పేర్కొంటూ నాన్న రాసినవే పై నున్న వాక్యాలు.

తనని తాను ఫ్రీలాన్స్ జర్నలిస్టుగానే చెప్పుకున్న ఆయన పత్రికా పాలసీలతో సంబంధం లేకుండా ఎందులో పనిచేసినా మానవీయ ప్రజాపక్ష పాత్రికేయ విలువలకే ప్రాధాన్యత ఇచ్చారు. ఒక రకంగా ఫ్రీలాన్సర్‌గా నా పరిణామానికి నాంది పలికింది నాన్నే. ఎన్ని వృత్తి – ప్రవృత్తులు ఎంచుకున్నా నిఖార్సైన పాత్రికేయుడిగానే జీవించారు, అలాగే మరణించారు.

ఆయన ఫేస్‌బుక్ వాల్ లోని political views అనే దగ్గర "Against for all personal properties" అని ఉంటుంది. ఒక జర్నలిస్టుగా ఆయనేంటో చెప్పకనే చెప్పే అక్షర సత్యాలవి. ప్రపంచం మొత్తం మీద సెంటు భూమి లేని వ్యక్తిగా తన అస్తిత్వాన్ని అర్ధవంతమైన మార్గంలో తీర్చిదిద్దుకున్న నాన్న నిజానికి నాకు స్ఫూర్తిని ఇచ్చే మహోన్నత అక్షరం.

ఆయనో తీవ్రవాది, సంచలనకారుడు, పాత్రికేయుడు, ఉద్యమకారుడు, తిరుగుబాటుదారుడు, రాజకీయవేత్త, ఆధ్యాత్మికవేత్త, నాస్తికుడు,

హేతువాది, కులనిర్మూలన వాది, కులవాది, మతవాది, స్వాప్నికుడు, రచయిత, మానవతావాది ...ఇలా ఎన్నో భిన్నాంశాల కలయిక. సత్యనారాయణ శాస్త్రి గా ఉన్న తన వ్యక్తిత్వాన్ని బాంబుగా సుస్థిరం చేసుకున్న పరిపూర్ణ భావుకుడు.

తన FB లో ఒకచోట "I WANT TO LIVE MY LIFE WITHOUT STRESS AND WORRIES. I DON'T NEED TO BE RICH AND FAMOUS. I JUST WANT TO BE HAPPY". అని ఉన్న వాక్యాలే నిజానికి ఆయన ఆశించిన జీవన మార్గానికి ఉదాహరణగా నిలుస్తాయ్. ఆనందాన్ని ఆస్వాదించడం ఒక స్థితి. దానిని జీవితాంతం పరితపించిన స్థితప్రజ్ఞుడాయిన.

నాన్నతో అనుభవాలన్నింటినీ అక్షరబద్ధం చేసేంత శక్తి నాకు లేదు. ఎన్ని వివాదాలొచ్చినా మా మధ్య ఒక తెలీని సయోధ్య ఎప్పుడూ ఏర్పడేది. అందుకు ముందుగా చొరవచూపే నాన్న వ్యక్తిత్వం లోని పరిపక్వతే కారణం. చాలా విషయాల్లో ఆయన ప్రతిబింబం నేను.

చిన్నప్పటి నుంచి 'బాంబు గారబ్బాయ్' అనే టేగ్ నన్ను వెంటాడేది. ఎక్కడికెళ్ళినా అదే గుర్తింపు. సొంత అస్తిత్వం ఏర్పర్చుకునే వరకూ నా అస్తిత్వం నాన్న పేరే! అదే 'బాంబు గారబ్బాయ్!! ఒకప్పుడు ఆ పిలుపుకు చిరాకు పడ్డా ఈ రోజు అసలా పిలుపులో ఉండే ఉద్విగ్నతకి జోహార్లు చెబుతున్నా.

ఎలాంటి పేరది. ఎంతమందికి ఒక ధైర్యాన్ని, భరోసాని ఇచ్చింది. ఇంకెంతమంది ఆ పేరుని వింటేనే భయపడేటట్లు, బెంబేలు పడేటట్లు చేయగలిగింది? పేరు తల్లిదండ్రులు పెడతారు లేదా ఎవరకి వారే పెట్టుకుంటారు. కానీ ఒక వ్యక్తి చేసే పనుల వల్ల ప్రజలే స్వచ్ఛందంగా "బాంబు" అనే పేరు పెట్టి ఏ ఇబ్బంది వచ్చినా నాన్న దగ్గరికి రావడం చూస్తే, నిజానికది పేరు కాదు, ఆయనకి ప్రజానీకం ఇచ్చిన బిరుదది అనిపిస్తుంది.

మాటలు చేతలూ ఉన్నంత చురుగ్గా నాన్న రాతలుండేవి కాదు కానీ, అడపాదడపా రాస్తూనే ఉండేవారు. ఆయన జీవితం పట్ల ఒక ముద్ర వేసేయడం అంత సులువు కాదు. కరపత్రాలు మొదలుకొని సామాజిక

మాధ్యమాల్లోనూ, పత్రికల్లోనూ రాసిన అనేక రచనలు వేటినీ ఆయన ఎన్నడూ భద్రపర్చుకోలేదు సరికదా కనీసం అంత ఇష్టంగా రెండో సారి చదువుకున్నది కూడా లేదు.

సామాజిక మాధ్యమాల్లో మరణించడానికి ముందు ఆయన కొన్ని సందర్భాలలో రాసిన వ్యాసాలను కొన్నింటిని సేకరించి ఇలా పొందుపరుస్తున్నాం. ఇంకా ప్రచురించాల్సినవి చాలా ఉన్నాయి. మొత్తం 'బాంబు' రచనలు అన్నింటినీ ఒక్కదరికి చేర్చి పుస్తకంగా కూర్చే ఆలోచన ఉంది కానీ ఎంతవరకూ వీలవుతుందో చూడాలి.

నేనూ కళ్యాణి కలిసి ఉండటం తటస్థించాక నాన్నతో ఒక ఔద్వేగికానుబంధం పెరిగింది. పెద్దగా మాట్లాడుకుందేమీ లేకపోయినా నా మార్గం పట్ల పైకి చెప్పని ఒక సంతృప్తిని ఆయన కళ్ళల్లో చూసేవాడిని. అమ్మలకి సమానత్వం కావాలని మదర్స్ డే రోజున నేను రాసిన రైటప్‌కి స్పందించి మూడు భాగాలుగా ఆయన రాసిన రైటప్ లు మా కుటుంబానికి సంబంధించి చాలా విలువైనవిగా నేను భావిస్తాను.

అందుకే పాత కొత్తల కలయికతో నున్న ఆయన రాతల్ని యధాతథంగా ఇస్తున్నాం. ఆయన మాటలు, చేతల్లాగే రాతల్లో కూడా ఒక ఒరవడి ఉంది. ఆ దుమికే స్వభావమే ఆయన వ్యక్తిత్వానికి ఒక భిన్నత్వాన్ని చేకూర్చింది. ఎవరు అంగీకరించినా లేకున్నా తనకంటూ ప్రత్యేకమైన స్థానం పొందినది ఆ వ్యక్తిత్వమే. అదే ఆలోచనాపరులు అందరికీ ఆయన్ని దగ్గర చేసిన ఉదారత్వం, స్థిరత్వం, ముగ్ధత్వం !

నాన్న లేని జీవితం నన్ను నేను కోల్పోయినట్లుగా ఉంది. సుదీర్ఘమైన ఆయన సమక్షంలో అలవాటైపోయిన భరోసా హఠాత్తుగా మాయమైపోయినట్లు ఉంది. కొండంత ధైర్యాన్నిచ్చే ఒక గొప్ప అండ అలవోకగా ఇక సెలవంటూ వెళ్ళిపోయినట్లు ఉంది. ఎడతెగని కన్నీటి నిట్టూర్పులా ఉంది.

ఆయన జీవితంలో నాకు అందించిన అత్యుత్తమ వారసత్వం ఏదైనా ఉందంటే అది అక్షరం. అవును. ఎవరికీ తలవంచని, ఏ ఆయుధాలూ ఛేదించని విలువలతో కూడిన అక్షరం. ఆ అక్షరం సాక్షిగా మాటిస్తున్నాను. నాన్న నేర్పిన సంస్కారం సమాజహితానికే ఉపయోగిస్తాను. నేను నమ్మిన విలువలనే జీవితాంతం పాటిస్తాను.

అందులో భాగంగా అడపాదడపా నాన్న FB లో రాసిన కొన్ని రైటప్ లని ఈ విధంగా గుదిగుచ్చి ఆయన ప్రథమ వర్ధంతి సందర్భంగా ఇలా తీసుకు రావడం జరుగుతోంది. ఇదే ఆయనకి ఇవ్వదగ్గ అర్ధవంతమైన నివాళి అని నా అభిప్రాయం. సంకుచితమైన ప్రయోజనాల కోసం అద్భుతమైన మానవ జీవితాన్ని పణంగా పెట్టే వారిలో ఒక్కరైనా అర్ధవంతంగా ఆలోచించడానికి ఈ అక్షరాలు స్ఫూర్తినిస్తే ఈ ప్రయత్నం సఫలమైనట్లే.

ఆస్తులూ, అంతస్తులూ కాదు, అక్షరాలనే గొప్ప మహోజ్వల కాంతిని వారసత్వంగా అందించిన గొప్ప మనిషి మా నాన్న. ఆయనకి నివాళిగా నేను ఇవ్వదగ్గ కనీస నీరాజనం ఈ అక్షరాలు. నాన్న విజిటింగ్ కార్డులు ఎన్ని రకాలవి ముద్రించినా వాటి పై ప్రారంభంలోనే మూడు పదాలుండేవి. ఫ్రీలాన్స్ జర్నలిస్టు అసోసియేషన్ టేగ్ లైన్ గా ఉండే ఆ మూడు పదాలే ఆయన జీవన సారం. అవి,

**Free !      Frank !!      Fearless !!!**

# అమ్మలకి సమానత్వం కావాలి !

మా అమ్మ పేరు రాధ, అనురాధ. మా నాన్న చెయి పట్టుకుని ఎక్కడో ఉన్న చత్తీస్‌గఢ్ నుండి 35ఏళ్ళ క్రితం ఇక్కడకి వచ్చేసింది. ఉత్తరాంధ్ర స్వస్థలం ఐనా చత్తీస్‌గఢ్‌లో పుట్టిందామె. అందరు అమ్మల్లాగానే పనినీ ఆమెనీ ఎప్పుడు విడదీసి చూడాలన్నా కుదరదు. పని, విపరీతమైన పని, అమ్మంటే పని.

చిన్నప్పట్నుంచీ మా అమ్మకి ఏది ఇష్టమో మాకు తెలీదు, మా ఇష్టాయిష్టాలకి ఆమె ఇచ్చే ప్రాధాన్యత వల్ల ఆమెకంటూ ఇష్టాలు ఉంటాయనే ఆలోచన కూడా మాకెప్పుడూ రాలేదు. పెద్దయ్యాక కూడా కాఫీ టీలు అందించడానికి, వంట చేస్తూ ఇంటిని శుభ్రంగా ఉంచడానికే తప్పా ఆమెకంటూ ఒక వ్యక్తిత్వం ఉంటుందని అనుకోలేదు.

ఎలా అనుకుంటాం? స్త్రీలంటే తెలివి, జ్ఞానం లేనివాళ్ళనీ ఇంటికీ, ఒంటికీ చాకిరీ సేవలు చేయడానికే తప్పా మనుషులుగా వాళ్ళకేవీ అనుభూతులు, అభిప్రాయాలు, ఆలోచనలు ఉండవనే పురుషాధిక్య వ్యవస్థలో ఏ కుటుంబంలో ఐనా ప్రజాస్వామ్యం అంటే మెజారిటేరినిజమనీ, బతకడమంటే సంపాదనేననీ, మనుషులంటే మగాళ్ళేననే భావజాలం అప్రయత్నంగానే ఉంటుంది.

ఇంట్లో ఏ సంతోషమైనా అమ్మే ఆనందిస్తుంది. ఇంట్లో ఏ గొడవైనా ముందుగా అమ్మే ఏడుస్తుంటుంది. మా శారీరక రోగాల నుండి మానసిక వికారాల దాకా అన్నింటినీ మూడు దశాబ్దాలుగా అమ్మ భరిస్తూనే ఉంది. ఐనా, మాకు బుద్ధీ, ఆమెకి అలుపు రాలేదు.

ఆమె జీవితంలో అత్యంత ఎక్కువగా కోరుకుంది నిద్రని! అలుపెరుగని పనిలో ఎప్పుడూ కనీసం కొంతసేపైనా విశ్రాంతి ఉంటే బాగుండునని

కోరుకునే అమ్మల్లో నాకెందుకో శ్రామికుడే కనపడతాడు, అందుకే కుటుంబం అంతటినీ పెట్టుబడిదారుడితో పోల్చాలేమో!

దోపిడీని త్యాగంగానూ, అణిచివేతని అనుబంధం గానూ గ్లోరిఫై చేసుకునే చోట కుటుంబం అనేది కచ్చితంగా అంతం కావాలని ఆశించే నా వంటి అరాచకవాది ఆలోచనలకు సమాజంలో ఎలాగూ స్థానం ఉండదుకానీ ఉన్నంతలో అమ్మల్ని కాస్త వ్యక్తులుగా చూద్దామనే తపనే ఈ రాతకి కారణం.

ఇన్నేళ్ళ నుండి ఎన్ని చోట్ల తిరిగొచ్చినా అమ్మ దగ్గరే ఉండేవాడ్ని. ఈ సారి నన్ను కోరి నాతోనే జీవిస్తానని పట్టుబట్టి పోరాడి ఇంట్లోంచి వచ్చేసిన నా కళ్యాణమ్మతో ఉంటున్నాను. అనుబంధాల్ని కూడా యాంత్రికం చేసేసిన ఈ “దినాల” పై నాకు మంచి అభిప్రాయం లేదుకానీ ఈ కోవిడ్ కారణంగా ఇళ్ళల్లో మరింత పని చేస్తున్న అమ్మలందరికి నా ప్రేమలు.

మదర్స్ డే రోజు, “అమ్మ” కి కావాల్సింది డబ్బులో, పొగడ్తలో , దర్పాలో కాదనీ ప్రేమ, వ్యక్తిత్వం, కాస్త విశ్రాంతి అని పేర్కొంటూ,సమాజంలో అమ్మలకి సన్మానాలు కాదు, సమానత్వం కావాలనే ఇంగితం ఎప్పటికైనా ఈ వ్యవస్థ కి వస్తుందనే ఆశతో, మా అమ్మ కోసమిలా చిన్న పరిచయం.

**(మదర్స్‌డే రోజున నేను రాసిన రైటప్)**

– గౌరవ్

*ఆలస్యంగా పరిచయం అయినా అత్యంత ఆత్మీయుడిగా మారిన వ్యక్తి శాస్త్రిగారు. ఆయన్నెప్పుడూ గురువుగారనే తప్పా మరోలా సంబోధించలేదు. సాంప్రదాయానికి, శాస్త్రానికీ మధ్యన ఒక సమన్వయ వారధిలా పని చేయడం ఆయనకే చెల్లింది. గురువుగారి మరణం మా అందరికీ తీరని లోటు.*

***–విద్యాసాగర్,*** *సామాజిక ఆలోచనాశీలి,*
*హిందూపురం.*

# మేమిద్దరం మాకు ముగ్గురు!



ఈ ఫొటో మాపెద్దబ్బాయి 'గౌరవ్ ప్రథమ జన్మదినం' సందర్భంగా పిఠాపురంలో మా ఇంట్లో తీసింది !

మా 'పెళ్ళి' 12 అక్టోబర్ 1986 విజయదశమి రోజు పిఠాపురం రామక్రిష్ణా కళ్యాణ మండపంలో జరిగింది

దిగువ మధ్యతరగతి కుటుంబంలో ఉండే అన్ని 'ఆక్షేపణలు' 'ఆకర్షణలూ' మా ఇద్దరి జీవితాల్లో కూడా పుష్కలంగా ఉన్నాయి!

అప్పటికే నాకంటూ వైవాహిక జీవితం మీద కొన్ని బలమైన అభిప్రాయాలు ఉన్నాయి!

దిగువ మధ్యతరగతి ఆర్థిక నేపథ్యం గల రెండు కుటుంబాలనుంచి వచ్చిన మేమిద్దరం ఇష్టపడి మా'వైవాహిక బంధానికి గుర్తులుగా' 1) గౌరవ్,

*ప్రతిరోజూ ఉదయాన్నే ఫోన్‌లో పలకరించే శాస్త్రిగారు ఇక లేరంటే నమ్మడం కష్టంగా ఉంది. ఎంతో అభిమానంగా ఉంటూ ఎన్నో అంశాల్ని ఎప్పటికప్పుడు మాతో చర్చించే శాస్త్రిగారు లేకపోవడం బాధాకరం.*

***–రఘు,*** *జర్నలిస్టు, కర్నూలు*

2) రోహిత్, 3) తేజ ముగ్గురు బిడ్డలకిజన్మనిచ్చేం !

పెద్దవాడు గౌరవ్ ఆ పేరు పూర్తిగా నాయిష్టంతో అర్ధాంగి అనూరాధ అంగీకారంతో... ' క్రిష్ణగౌరవ్ ' అని పెట్టాం!

రెండోవాడు రోహిత్ పుట్టినప్పుడు 'నీ ఇష్టం వచ్చిన పేరు చెప్పమన్నాను' నేను. మీ ఇష్టమే నాయిష్టం అంది రాధ.

వాళ్ళనాన్న గారు రాయపూర్లో 'పౌరొహిత్యం' చేసేవారు ఆయన 'స్మరించేలా ' వుండాలని 'కిష్ణ పురొహిత్ ' అని పేరు పెట్టాం. వాడుకలో 'రోహిత్' అని పిలిచేవాళ్ళం.

మూడో వాడు తేజ, నాకు ఆడపిల్ల కావాలని కోరిక. రాధ కీ ఇష్టం, తోమ్మిదో నెల గర్భవతిగా ముందు రెండు సార్లు రాయపూర్లోనే 'డెలివరీ' అయ్యింది.

ఈసారి ఇక్కడే పిఠాపురం లోనే పురుడు, రాయపూర్ వెళ్ళను అంది. అలాగే అనుకున్నాం, ఆఖరి నిముషంలో రాయపూర్ వెళ్తాను మా అమ్మానాన్నల్ని చూడాలి, నన్ను దిగపెట్టండి అంది. అలాగే అన్నా!

అప్పట్లో రాయపూర్ వెళ్ళడానికి ఉన్న ఏకైక వాహనం 'రాయపూర్ పాసింజర్' 'దేశం బండి' అని పిలిచేవారు సాయంత్రం విశాఖపట్నంలో

*అభివృద్ధి పేరిట ప్రజల జీవితాల్ని విధ్వంసం చేసే పరిశ్రమల పట్ల వ్యతిరేక వైఖరిని ఆయన జీవితాంతం అవలంభించారు. పబ్లిక్ హియరింగ్‌లు జిల్లాలో ఎక్కడ జరిగినా ప్రజాపక్షంగా ప్రశ్నించడానికి ఆయన ముందుండేవారు. ఒకసారలా కంపెనీ గుండాలు ఆయన ఫైలు లాక్కోగా ధైర్యంగా కలెక్టరు గారిని నిలదీసి తిరిగి వాటిని పొందడం జరిగింది. ఈ రోజు భద్ర జీవులుగా కాలం వెల్లదీస్తున్న మనందరం ఆయన హక్కుల స్పృహను ఆచరణాత్మకంగా కొనసాగించగలగడమే ఆయనకి మనమివ్వదగ్గ నివాళనేది నా అభిప్రాయం.*

**-ఏడిద రాజేష్,**

*మానవ హక్కుల వేదిక, అమలాపురం*

బయలుదేరి మర్నాడు మధ్యాహ్నం పదకొండు గంటలకు రాయపూర్ వెళ్ళేది. రైట్ టైంకు వెళితే, లేటైతే..,... ఆ రోజో మర్నాడో దాని దయా మన ప్రాప్తం.

తొమ్మిది నెలలూ నిండిన రాధని రోహిత్‌ని తీసుకుని గౌరవ్‌ని పిఠాపురంలో మా అమ్మ దగ్గర వదిలేసి ఆ దేశం బండెక్కేం రాధ కాకుండా మరొక ముగ్గురు ఆడవాళ్ళు మాత్రమే ఉన్నారు మా కంపార్టుమెంట్లో....

సుదీర్ఘ ప్రయాణంలో ఏ రాత్రైనా రాధకి .... నొప్పులు వస్తే....రాధ పరిస్తితి నా పరిస్తితి ఏడాదిన్నర పిల్లాడి పరిస్తితి(?)

ఇప్పటిలా మొబైల్ ఫోన్లు లేవ్, 'ఉపకారం అంటే ఊరొదిలి పారిపోయే జనాల' మధ్య సుధీర్ఘ ప్రయాణం.

విశాఖపట్నం లో బయల్దేరిన మా రైలు విజయనగరం చేరుకునేసరికి రమారమి రెండు గంటలు పట్టినట్లుంది ఈలోపులో మా అమ్మ కట్టి ఇచ్చిన దిబ్బరొట్టి కానిచ్చేశాం.

పిల్లాడికి పాలు, పొడి కనీసం ఇద్దరు మనుషులు తినడానికి రెండురోజులకు సరిపడా ఫుడ్డు. ఇది మా సరంజామా, వేరుశెనక్కాయలుకొన్నా, నాలుగుకాయలు తిన్నాం రైలు మళ్ళీ బయల్దేరింది.

*కీ. శే. ఆవంత్స సోమసుందర్‌గారు మరణించినప్పుడు అక్కడికి వచ్చిన సత్యనారాయణ గార్ని మొదటిసారి చూసాను. ఆయన తనని తాను పరిచయం చేసుకుంటూ, "నేను గౌరవ్ వాళ్ళ తండ్రిని" అనడం ఆశ్చర్యం కలిగించింది. మామూలుగా బిడ్డల అస్తిత్వాన్ని గౌరవించడమే తక్కువగా ఉన్న వ్యవస్థలో తన కుమారుడి పేరుతో ఏ మాత్రం అభిజాత్యం లేకుండా అంత కలుపుగోలుగా పరిచయం చేసుకోవడం స్వచ్ఛమైన ఆయన వ్యక్తిత్వానికి మచ్చుతునక అని నా అభిప్రాయం. తన పార్థివ దేహాన్ని ప్రజా సంక్షేమం కోసం ఇవ్వడం ద్వారా ఆయన ఎంతటి ఆధ్యాత్మిక వాదైనప్పటికీ మనిషి పక్షాన ఎప్పటికీ నిలిచే మానవతావాదిగా శాశ్వతంగా నిల్చిపోయారనడంలో సందేహం లేదు.*

***–డా. చెలికాని స్టాలిన్,***

*సామాజిక వేత్త, రామచంద్రాపురం*

'రాధకి నొప్పులూ ప్రారంభం అయ్యాయి' పార్వతీపురం స్టేషన్ వచ్చిందగ్గర్నుచి నెక్స్ట్ వచ్చే స్టేషన్ రాయపూర్ స్టేషనేమో అంటూ ఎదురు చూడటం

రాధని బుజ్జగించడం రోహిత్ గాడిని ఆడించడం, కొంతసేపటికి వాడు నిద్రపోయాడు

మొత్తానికి ఎవరి సహాయ సహకారాలు తీసుకోకుండా ఒక పెట్టి సిగరెట్లు తగల బెడుతూ.....అప్పట్లో రైళ్ళలో సిగరెట్ కాల్చడం నిషేధం కాదు, సైడ్ లొయర్ బెర్త్ మధ్యన రెండు కిటికీలకు మధ్య 'యాష్ ట్రే' లుకూడా బిగించి ఉంచేవారు సిగరెట్ ప్రియుల సౌకర్యం కోసం.

ఉదయం పదకొండు గంటలకి రాయపూర్ స్టేషన్‌కి క్షేమంగా చేరుకున్నాం

ఫ్లైఓవర్ బ్రిడ్జ్ మించి నా చెయ్యి పట్టుకుని నిండుగర్భిణి రాధ, నేను నడుచుకుంటూ స్టేషన్ బయటకు చేరుకున్నాం. నేను ఇంట్లోకి వెళ్ళేను రాధని హాస్పిటల్‌కు తీసుకువెళ్ళేరు. నేనూ హాస్పిటల్ కి వెళ్ళేందుకు తయారౌతున్నా

ఈలోపు 'పిడుగు' లాంటి వార్త, 'రాధ మళ్ళీ మరో 'మగ పిల్లాడికి జన్మ నిచ్చిందని! వాడే మా మూడో వాడు తేజ నామకరణంతో వాడికి పెట్టిన పేరు 'కిష్ణతేజ'. వాడుకలో తేజు గాడు.

*నేను పిఠాపురం వచ్చిన కొత్తలో బాంబుగారికీ నాకూ సోమేశ్వర్రావనే కామన్ ఫ్రెండ్ ద్వారా పరిచయం. తెలీని వాళ్ళు మా ఇద్దర్నీ అన్నదమ్ములనుకునేవారు. బాంబు గారిది విలక్షణమైన వ్యక్తిత్వం. శ్రీశ్రీ గారిని అంతా కమ్యూనిష్టు అనేవారు. ఆయన సంతాప సభలో అభిమానం కొద్దీ నేను పాల్గొన్నాను. అలా బాంబు గారు ఇటు ఆధ్యాత్మికత అటు భౌతికవాదాల మేలు కలయిక. ఒకపక్క సాంప్రదాయాన్ని పాటిస్తూ పూజలు, యాగాలు చేస్తూనే మరోవైపు హేతుబద్ధంగా ఆలోచించేవారు. చివరి వరకూ మానవతావాదిగానే జీవించారాయన.*

**–వాసుదేవరావు,** *ఎల్ఐసి, పిఠాపురం*

# నేనేం 'ఆత్మకథ' వ్రాయాలని కోరుకోవడం లేదు!



'మేమిద్దరం మాకు ముగ్గురు' అంటూ నిన్న నేను వ్రాసిన ఆ నాలుగు లైన్లు చదివిన వాళ్ళు మీ 'పెళ్ళి'ముందు 'ప్రీ మ్యారేజ్ ఇష్యూస్' వ్రాసివుంటే ఇంకా బాగుండేది అంటూ అభిప్రాయం వెలిబుచ్చేరు.

కరోనావల్ల ఇంట్లో ఖాళీగా కూర్చుని కాలక్షేపం కోసం వ్రాసే 'కాలక్షేపం బఠాణి' కథ కాదు ఇది!

మొన్న 'మదర్స్ డే' రోజున నా పెద్దకొడుకు గౌరవ్ వాళ్ళమ్మ గురించి వ్రాస్తూ.... "అమ్మలకి సమానత్వం కావా" లంటూ ఒక స్టేట్‌మెంట్ ప్లేస్ చేశాడు.

మా కోడలు కళ్యాణి ఆ 'రైటప్'ని అందరితో బాటు నాకూ... పంపించింది చదివేను చాలాబాగా వ్రాశాడనిపించింది. రాధ కూడా చదివింది చదువుతూ..... కళ్ళంబడి నీళ్ళు పెట్టుకుంది.

*బాంబు మావయ్య చిన్నప్పటి నుంచి నాకు స్ఫూర్తి. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ ఉండే ఆయన ఎంతో మందికి ఒక భరోసా. బాంబు మావయ్య మరణంతో ఒక రకంగా పిఠాపురం కళను కోల్పోయింది.*

***–పూడిపెద్ది శంకర్ & సరస్వతి,*** *విశాఖపట్నం.*



నాలో అంతర్మధనం ప్రారంభం అయ్యింది. రాధ తన కొడుకు గౌరవ్ వ్రాసిన ఆ నాలుగు లైన్లూ చదువుతూ.... ఎందుకు ఏడ్చింది?

అసలు గౌరవ్ ఏ ఉద్దే శంతో మదర్స్ డే రోజున వ్రాసిన వ్రాతల్లో 'అమ్మలకి సమానత్వం' కావాలని స్టేట్మెంట్ ఇచ్చాడు?

జనరల్ స్టేట్మంటా? వాళ్ళమ్మ గురించి పర్టిక్యులర్ గా ఇచ్చిన స్టేట్ మెంటా? 'మాఅమ్మ రాధమ్మ' అంటూ ప్రారంభించేడు కాబట్టి ఆ అక్షరాలు రాధ గురించి ప్రత్యేకంగా వ్రాసినవే అనిపించింది.

'ముగింపు' లో నాకోసం నాచెయ్యి పట్టుకుని అందరితో గొడవ పడి వచ్చేసిన నా అర్ధాంగి 'కళ్యానమ్మ అంటూ... వ్రాశాడు'

నేను ఇక్కడే నాలుగు ముక్కలు చెప్పాలనుకున్నా ఎవరికి? మా పిల్లలు ముగ్గురికి, మా కోడలు కళ్యాణికి.

*బాంబు గారు మా ఊరికి పెద్దదిక్కు. ఏ ఆపద వచ్చినా ముందుండేవారు. నాకు అనేకసార్లు విలువైన సలహా సంప్రదింపులకు చేదోడుగా ఉన్నారు. ఆయన కుటుంబం నా కుటుంబం. వారికే సమయంలో ఏ అవసరం వచ్చినా నన్ను ఒక కుటుంబ సభ్యునిగా భావించాలని విన్నవించుకుంటూ బాంబు గారి మరణానికి నా నివాళులు.*

**–అల్లవరపు నగేష్**

పిఠాపురం లో 'పైల రాజులు' గారని నేతి వ్యాపారి ఒకరు వుండేవారు. ఆయన పిఠాపురం మున్సిపాలిటీలో మాజీ కౌన్సిలర్ కూడా. వారు వ్యాపారరీత్యా తరచూ రాయపూర్ వెళ్ళేవారు. రాధ వాళ్ళ కుటుంబంతో మంచిస్నేహ బంధం ఉండేది.

రాజులు గారు ఒకరోజు నాతో, మాగురువు గారమ్మాయి వుంది. మీకు బంధువులే నువ్వు పెళ్ళిచేసుకుంటే బాగుంటుంది అని ఓ ప్రపోజల్ పెట్టారు.

నాకెందుకో చిన్నప్పటి నుండి హిందీ భాషమీద 'మోజు'. దక్షిణ భారత హిందీ ప్రచార సభ వాళ్ళ పరీక్షలు కుడా పాస్ అయ్యేను. 'సత్తిరాజు మాస్టారని' మాకు స్కూల్లో హిందీ మాష్టారు నాకు హిందీ నేర్పడానికి ఆయన చాలా కష్ట పడ్డారు.

పైలరాజులుగారి ప్రోత్సహంతో రాధ వాళ్ళు పిఠాపురం వచ్చారు మాతో సంబంధం ఖాయం చేసుకోడానికి.....

ఆరోజు నాదెండ్ల భాస్కరరావు గారు పిఠాపురం మా ఇంటికి వచ్చారు భోజనానికి. ఒక ముఖ్యమంత్రి స్థాయి వ్యక్తి నా ఇంటికి భోజనానికి రావడం నేను చాలా గర్వంగా ఫీలయ్యేను. భోజనాలైపోయి ఆయన కాకినాడ వెళ్ళిపోయాకా మా 'ప్రధానం కార్యక్రమం' జరిగింది మా ఇంటి గురువు

*బాంబు గారిని గుర్తు చేసినందుకు ధన్యవాదాలు. ఆయన ఒక ప్రభంజనం. బాంబు కాలం చేయడం విషాద సన్నివేశం. ఆయన మాటల తూటాలు రాజకీయ వ్యవస్థపై కొందరు వ్యక్తులపై ఆయన వేసే వ్యంగ్య బాణాలు నాకింకా గుర్తే. మంచి మిత్రుడు, మరపురాని చైతన్యం, ఆయనో సంచలనం. నేను పిఠాపురం వదిలిన తర్వాత ఆయన మళ్ళీ నాకు కనబడలేదు. బాంబుకు ప్రగాఢ నివాళి. అదేరోజు నేను ఊర్లో ఉండటం లేదు. లేకపోతే తప్పనిసరిగా ఆయన సంస్మరణ సమావేశానికి తప్పక హాజరు అయ్యి ఉండేవాన్ని.*

**–శ్రీకంఠ స్ఫూర్తి,** కవీ, *రచయిత*

## నేటి సమాజానికి "బాంబూ"లు ఎంతైనా అవసరం...

*బాంబూ ఓ భాస్వరం....!*

*బాంబూ ఓ ధిక్కార స్వరం....!*

*బాంబూ ఓ మేలుకొలుపు.....!*

*ఆత్మీయంగా సాంత్వనపరిచే ఓ తీయటి చరుపు బాంబూ....!*

*మనమందరం మన తల్లిదండ్రులు పెట్టిన పేరుతోనే లోకంలో పిలవబడుతున్నాం.*

*ప్రజలు పెట్టిన పేరుతో తనకు తానే Self ID తెచ్చుకున్న ఓ విశిష్ట వ్యక్తిత్వం గల వ్యక్తి శక్తి బాంబూ. బాంబూ బ్రహ్మాడా.....!? ఆశ్చర్యం....*

*అతను One Man Army.....*

*పిరికితనం ఎరగని పెంకి....*

*సమాజంలోని సమస్యల పద్మవ్యూహంలోకి చొరవగా చొరబడి, విజయవంతంగా తిరిగి వచ్చిన యుద్ధాలే ఎక్కువ అతని జీవితంలో. ఓ నలభై ఏళ్లగా బాంబూ పేరుతోనే మనమధ్య తిరుగుతున్నా, ఓ పదిహేనేళ్ళుగా గుండెజబ్బునే సైలెంట్ బాంబుగా గుండె పక్కనే పెట్టుకొని, మొండిగా నవ్వుతూ తిరుగుతూనే వున్నాడు చివరి వరకూ....*

*"నే దొర్లిస్తున్నవన్నీ బోనస్ డేసేనండి" అని సంబరపడుతూ నవ్వుతూ చెప్పేవాడు.*

*"పాపి చిరాయువు" అనుకొనే ఓ వర్గపు బాబులకు బాంబూ సడన్ సుఖ మరణం మింగుడుపడని ఓ పచ్చి వెలగ. పెళ్ళాం పిల్లలతోబాటు సిగరెట్‌ను కూడా వదులుకోలేనంతగా ప్రేమించిన ప్రేమతత్వి... చావుని ఇష్టపడని వారు కూడా ఇష్టపడే చావు హార్టెటాక్. అది అతనిని చాలా కాలం వరిస్తూ, వరిస్తూ చివరికి జీవిత కథ సుఖాంతం చేసింది. మరణాంతరం కాలి బూడిదై నిష్ప్రయోజనమయ్యేకంటే, పోయేక కూడా నలుగురికీ ఉపయోగపడేలా బ్రతకాలనే అతని సహృదయతకు, ఔదార్యానికి విప్లవ భావధోరణికి నిలువుటద్దం అతని నేత్ర, దేహదానాలు.*

*నిజానికి బాంబూ లేని లోటు అతని కుటుంబాని కంటే మన పిఠాపురానికే ఎక్కువ. ఎంత ఘోరం జరుగుతున్నా కళ్ళెదుటే దారుణ అన్యాయం జరుగుతున్నా మోసాలు, మీసాలు మెలేసి విర్రవీగుతున్నా ఏదీ పట్టించుకోని ఓ నిర్లిప్తత, మనకెందుకులేనన్న ఓ నిర్వీర్యత, స్తబ్దత, నిశ్శబ్దత, భయంకర జాడ్యమై సమాజాన్ని పీడిస్తున్న దుర్దశలో మనకు 'బాంబూ'ల అవసరం ఎంతైనా ఉంది.*

**-మేకా మన్మధరావు,** *కవీ, రచయిత, పిఠాపురం*

శేషయ్యగారు రాధావాళ్ళ నాన్న కలిసి మా ఇద్దరి చేత పూజలు చేయించేరు. కార్యక్రమం పూర్తిచేసుకొని నేనూ కాకినాడ వెళ్ళిపోయాను హడావుడిగా సాయంత్రం నాలుగు గంటల సమయంలో.

నేను కాకినాడ నుండి వచ్చేసరికి రాత్రి సుమారు ఎనిమిది అయ్యింది. నేను వెళ్ళేసమయంకి ఉన్న సెటప్ అంతా అలాగే ఉంది మాఅమ్మ నాన్న అక్కా రాధ వాళ్ళు అమ్మానాన్న ప్రసాద్ బాబు......

నన్ను ఎవరూ పట్టించుకోలేదు. నెమ్మదిగా వెనకనుండి నాగదిలోకి వెళ్ళిపోయా నా 'గుండె గుభేల్ మంది'

*మిత్రుడు, బాంబు చనిపోయినట్లు ఫేస్‌బుక్‌లో చూసాను. ఎవరినయినా కాంటాక్ట్ చేసేలోపు సంస్మరణ కూడా జరిగిపోయింది. గౌరవ్‌గారే బాంబు కుమారుడన్నమాట. 1981-82 నాటి మా కార్యకలాపాలు. చాలా కాలం అయినందున అన్ని గుర్తు లేవు. బాంబు నేను మరో ఇద్దరు. వారి పేర్లు గుర్తు లేవు. వెంకటేశ్వరరావు, మరొకరు. బాంబు పూర్తి పేరు తెలియదు. బాంబు పేలినట్లే నిర్ణయాలు, నిర్ధారణలు, ఆ రోజుల్లో మా కార్యకలాపాలు సంచలనాత్మకం. ఓ తూరి పింగళి దశరధరాంని తీసుకొచ్చాము. ఓపెన్ ఎయిర్ థియేటర్‌లో ఇసకేస్తే రాలని సభ. మరోసారి రావిపూడి వెంకటాద్రి మరోసారి వెనిగళ్ల సుబ్బారావు. పింగళి దశరధరాంతో బాంబుకు మంచి స్నేహమే. మా కార్యకలాపాలు ప్రాథమికంగా నాస్తికత్వం, చాలా కఠినంగా ఉండేవి, దేవుడున్నాడు అంటూ ఎవరో కసిగా సభ జరిపారు. జనం వేలం వెర్రిగా హాజరయ్యారు. ఆ తరువాత మెమో సభ జరిపాము. మా సభలకూ అలాగనే వచ్చేవారు. మా బృందంలో నిబంధన ఏమంటే రాజకీయాలలోకి వెల్లగూడదని. కానీ నేను కమ్యూనిస్టునయ్యాను. ఆ రకంగా బాంబుతో విభేదించాను. ఆ తరువాత ఈ దీర్ఘకాలంలో రెండు, మూడు సార్లే కలిసాను. బాంబు చనిపోవడం వెలితిగా ఉంది. గౌరవ్ రాసినట్లు, రాసే కళ నాకు లేదు. కొన్ని జ్ఞాపకాలు చెదరవు. వెలితి పూడిక సులభమూ కాదు. బాంబు ఓ తరానికి చలనమూ, సంచలనమూను.....*

**– శేషబాబ్జీ,** కమ్యూనిస్టు నాయకులు

రాధ ఒక్కర్తి ఒంటరిగా కూర్చుని వుంది. ఆ గదిలో. నాకు ఆ విషయం తెలీదు, పైగా ఏడుస్తోంది, జీవితంలో మొదటి సారి భయపడ్డా.

నెమ్మదిగా ఒంటరిగా కుర్చుని ఏడుస్తున్న రాధ వద్దకు వెళ్ళాను. నా జీవితంలో నేను రాధతొ మాట్లాడిన మొదటి మాట 'నీకు తెలుగు వచ్చా'?

వచ్చునంటూ... తల ఊపింది. ఎందుకు ఏడుస్తున్నావని ఆడిగేను, బయట రెండు ముడు గంటలుగా జరుగుతున్న బేరసారాల గురించి ఏడుస్తున్నా....అంది.

అర్థమయ్యేలా బయటవీధిగది వైపు చెయ్యచూపించి, మళ్ళీ ఏడవడం మొదలెట్టింది.నాకు ఏం చెయ్యాలో అర్థం కాలేదు. ఎవరైనా ఆ గదిలోకి వచ్చి మా ఇద్దర్ని అలా చూస్తే......

ఎవ్వరికి ఎలాంటి అవకాశం ఇవ్వదలచుకోలేదు. 'జీవితంలో మొదటిసారి రాధ చెయ్యి నాచేత్తో పట్టుకున్నా' ఈ పెళ్ళి నీకిష్టమేనా? అని అడిగా

'ఇష్టమే అంటూ తల ఊపింది' రాధ చెయ్యి పట్టుకుని బయట అందరూ కూర్చున్నగది లోకి వచ్చా, బళ్ళుమని తలుపులు తెరుచుకుని,

*చివర వరకూ పోరాట పటిమని వదలని వ్యక్తి బాంబు గారు. మాకు పరిచయమైన పదేళ్ళలో ఆయన పదుల సంఖ్యలో పోరాటాలు చేసారు. భక్తి పేరిట జరుగుతున్న వ్యాపారాన్ని ప్రశ్నించారు. మానసిక దుర్బరుల్ని దైవాంశ సంభూతులుగా ప్రచారం చేస్తూ పబ్బం గడుపుకునే వర్గాలకి వెన్నులో వణుకు పుట్టించారు. ఆయన మీదనే కాదు ఆయన పిల్లలతో సహా మొత్తం కుటుంబం మీద అక్రమ కేసులు పెట్టి వేధించినా అవినీతికి తావివ్వని, మహా వ్యక్తాయన. ఆయనకున్న పరపతికి తల్చుకుంటే అంతులేని ఆస్తులు ఆయనెన్నడో కూడగట్టుకుని ఉండేవారు. కానీ, యాభై ఏళ్ళకి పైబడి ఈ ఊరిలో ఉండి కూడా ఒక్క సెంటు భూమి లేకుండా పోవడం మచ్చలేని ఆయన నిజాయితీకి నిదర్శనం.*

***–పి. యస్. రవికాంత్,*** *అడుగుజాడ*

'పిన్ డ్రాప్ సైలెంట్'

మొత్తం బంధువులందరూ 'అవాక్కై పొయారు'! ఎవరికీ నోట మాట రావడం లేదు!! అప్పుడు ఎనౌన్స్ చేశాను, మీకందరికీ పది నిముషాలు టైం ఇస్తున్నాం.... ఈ సెటప్ మోత్తం క్లోజ్ చేశేయ్యలి. అప్పుడు మీ అందరికీ గౌరవం ఇస్తాం లేదంటే...పదినిముషాలు తర్వాత మేమిద్దరం బయటకు వెళ్ళి "పెళ్ళి చేసుకు వచ్చేస్తాం" అని

ఐదు నిమిషాల్లో అక్కడ సీన్ మొత్తం క్లోజ్, భోజనాలైపోయాయి. నెలతర్వాత అక్టోబర్ 12 సాయంత్రం 7:20కి పెళ్ళి. రాధని తీసుకువెళ్ళి పోయారు పెళ్ళి వారు, మేం పెళ్ళిపనుల్లో పడ్డాం!.

## 'ప్రపంచాన్ని ఔపాసన పట్టేయగల సత్తా నాకుంది' అనుకునే వయసు నాది

నాదెండ్ల భాస్కరరావులాంటి రాజకీయ ఉద్దండులు ముఖ్యమంత్రి పదవిలో ఉండి కూడా 'ఏం బాంబు ఏంటి విశేషాలు' అంటూ భుజం మీద చెయ్యివేసి పలకరించే స్థాయి నాది.

'నువ్వు పాణిగ్రహణం చేసే అనూరాధకు, నీకు నా ఆశీస్సులు. నిండు నూరేళ్ళు సుఖసంతోషాలతో జీవించండని'

స్వహస్తాలతో శ్రీ నాదెండ్ల భాస్కరరావు గారు వ్రాసిన శుభాకాంక్షలు సందేశం నాకు గొప్ప ఉత్తేజాన్నీ, ఉత్సాహాన్ని కలిగించేది

*ఒక వ్యక్తి జీవితాన్ని ఆచరణ ద్వారానే నిర్ణయించాలి. అందులో మంచి చెడులుంటాయ్, మమేకమయ్యే అంశాలూ ఉంటాయి. ఐతే, చివరగా ఆ వ్యక్తి తన జీవితం ద్వారా ఇచ్చిన సందేశం ఏమిటన్నదే ప్రధానం. ఆ దృష్ట్యా సత్యనారాయణ గారితో నాకు ఎక్కువ పరిచయం లేకున్నా నేత్రదానం, దేహదానం చేసి ఆదర్శంగా నిలిచిన ఆయన వ్యక్తిత్వానికివే నా జోహార్లు.*

**–కట్టా కృష్ణారావు**

పెళ్ళైన సంవత్సరానికి మా పెద్దవాడు గౌరవ్ మా జీవితంలో ఉదయించేడు!

రెండ్రోజులనుంచి కనీసం పదినిముషాలైనా వీడు నిద్దరపోవడం లేదంటూ.... గీపెట్టి ఏడుస్తున్న కొడుకును పట్టుకుని తానూ...



INVITATION

You are welcome to my Marriage with
RADHA
at 7-12 P. M. on 12th October 1986
at Ramakrishna Kalyana Mandapam, Pithapuram.
M. S. N. SASTRY

DINNER : 12th October night 8-00 hrs. at Ramakrishna Kalyana Mandapam





OM SRI RAMA
SREERASTU SUBHAMASTHU AVIGHNAMASTHU

Ch. Anuradha
WEDS
M. Satyanarayna Sastry

Smt. & Sri Ch. Narasimham Murty and Brothers
REQUEST THE PLEASURE OF YOUR COMPANY WITH FAMILY & FRIENDS ON THE AUSPICIOUS OCCASION OF THE MARRIAGE OF THEIR SECOND DAUGHTER

Chy. Sow. C. H. Anuradha
WITH
Chy. M. S. N. Sastry
only son of Sri M. Krishnamurti Bava Guru of PithaPuram

ON SUNDAY 12TH. OCTOBER 1986 AT EVENING 7-12 P. M. MESHA LAGNAM, AT RAMA KRISHNA KALYAN MANDAPPAM (PEDDA BAZAR, PITHAPURAM, E. G. DISTRICT A. P.)

WITH BEST COMPLIMENTS FROM
NEAR AND DEAR



ఏడుస్తూ.... చెప్పింది రాధ రాత్రి పదకొండు గంటల సమయంలో.

నాన్న షుగర్ ఫ్యాక్టరీ లో డిస్పెన్సరీ ఇంఛార్జి. ఆ డిస్పెన్సరీకి పార్ట్ టైం డాక్టర్ పి.ఇ.సుబ్రహ్మణ్యం గారు.

సుందరం మావయ్య స్కూటర్ వేసుకుని రాధని పిల్లాడిని ఎక్కించుకుని

*ఇంటి నుండి వచ్చేసి ప్రేమ వివాహం చేసుకున్న నాకు, నా ఇంటిని మిస్ అయిన ఫీలింగ్ కలగలేదు. అంటే దానికి కారణం గౌరవ్ & ఫ్యామిలీ! అవును. నాకు లభించింది కేవలం ప్రేమించిన వ్యక్తి కాదు. ప్రేమించే కుటుంబం. భాగస్వామి విషయంలోనే కాదు, అత్తమామల విషయంలో కూడా నేను చాలా అదృష్టవంతురాలినని అనిపిస్తుంది. మా మావయ్య (ఎం.ఎస్.ఎన్.శాస్త్రి అలియాస్ బాంబు గారు) మా వివాహం జరిపించడం దగ్గర నుండి రిజిస్ట్రేషన్, నా విధి నిర్వహణలో కలిగే ఇబ్బందుల పరిష్కారానికి చూపే చొరవ వరకూ నాకు మా నాన్నే గుర్తొచ్చేవారు. నన్ను బస్ ఎప్పుడు ఎక్కించాల్సి వచ్చినా మా నాన్నలానే నేను బస్ ఎక్కాకనే ఆయన ఇంటికి వెళ్ళేవారు. నేనే ఎందుకని వారించినా వినేవారు కాదు. నేను కుటుంబంలోకి వచ్చి రెండేళ్ళు అవకుండానే ఈ తండ్రి మాకు దూరమవడం నిజంగా చాలా బాధిస్తోంది. ఆయన మా మధ్య లేకపోయినా ఆయన జ్ఞాపకాలు,విలువలు ఎప్పుడూ మాతోనే ఉంటాయి.*

***–వి.ఎస్.డి.కళ్యాణి (కోడలు)***



రయ్ రయ్‌మంటూ వెళ్ళి డాక్టర్ గారూ.... అంటూ ఆయన్ని నిద్దర్లేపేసి పిల్లాడిని చూపించి ఆయన సలహామేరకు పొద్దున్నే ఆరుగంటలకు కాకినాడలో డాక్టర్‌కు చూపించి వాళ్ళ సలహా మేరకు 'ఆర్నెల్ల వయసున్న గౌరవ్ కి కాకినాడ జి.జి.హెచ్. లో 'మెలిపడ్డ పేగుకు' ఆపరేషన్ చేయించాం ఇద్దరం.

'థర్మస్ ప్లాస్క్' కిందపడి బ్రద్దలైపోడం', ఆపరేషన్ చెయ్యడానికి ముందే..... 'హౌస్ సర్జన్' లేడీ డాక్టర్ చెయ్యి జారి ....తీస్తున్న బ్లడ్ సీసా బ్రద్దలైపోయి గదంతా...రక్తం.... రక్తం మడుగు .....

ఇంతటి ఘోర 'అశుభ శకునాల' మధ్య గౌరవ్‌కి ఆప్రెషన్ జరిగిపోయింది సక్సెస్ఫుల్‌గా !

నేనూ రాధ ఒకరికి ఒకరం ధైర్యం, ఒకరికి ఒకరం భరోసా, ఒకరికి ఒకరం ఓదార్పు.

*"మల్లెతీగకు పందిరేయకుంటే, అది పక్కనున్న ముళ్ళ కంచె పైకి పాకుతుంది."అంటాడు దశరథరామ్ ఒకచోట. నేనెప్పుడూ గుర్తుంచుకునే గొప్ప వాక్యమిది. బాంబు గారితో నాకు వ్యక్తిగతంగా పరిచయం లేదు కానీ ఈ రోజు ఇంత మంది దూరప్రాంతాల నుండి ఆయనతో వారి జ్ఞాపకాలు పంచుకోవడం కోసం రావడం చూస్తే వ్యక్తిగా ఆయన సమాజహితం కోసం చేసిన కృషి అర్థమవుతుంది.*

**–మార్పు రాజేంద్రన్,** రావులపాలెం



ప్రజాస్వామ్య తెలుగుదేశం పార్టీ
PRAJASWAMYA TELUGU DESAM PARTY
245, జూబ్లీ హిల్స్. హైదరాబాదు. ఆం.ప్ర.

నాదెండ్ల భాస్కరరావు.
అధ్యక్షులు.

తేది. 6/10/86.

ప్రియసోదరులు శ్రీ సత్యనారాయణ శాస్త్రికి,

నీ వివాహానికి, వ్యక్తిగతంగా వచ్చి, ఆశీస్సులు అందజేద్దామనుకున్నాను. కారణాంతరాల వల్ల రాలేకపోతున్నాను.

నీకు, నీవు పాణిగ్రహణం చేయుచున్న చి.సౌ. అనురాధకి నా హృదయపూర్వక ఆశీర్వాదములు.

మీ జంట, కలకాలం ఆయురారోగ్యములతో, ఆనంద డోలికల్లో, సుఖమయ జీవితం గడపాలని మనసారా కోరుకుంటున్నాను.

అభినందనలతో

మీ
నాదెండ్ల భాస్కరరావు

దిగువ మధ్య తరగతి కుటుంబాల్లో ఉండే అన్ని ఆర్థిక ఇబ్బందులూ మాకూ ఉండేవి! నాన్న జీతం మాత్రమే మాకు ఆదాయ వనరు. ఇక్కడ మా అమ్మ గురించి ప్రస్తావించాలి:

అక్క పెళ్ళై మెడ్రాస్ వెళ్ళిపోయాకా పరిమిత ఆదాయంతో కుటుంబాన్ని చాలా సమర్థవంతంగా గుట్టుగా నడిపించేది మా అమ్మ క్రుష్ణవేణమ్మ.

అలాంటి సమయంలో మా ముగ్గురి మధ్యకు రాధ వచ్చింది వస్తూ...నే మరో ముగ్గుర్ని తీసుకు వచ్చింది మా ఇద్దరి ఇష్టపూర్వకంగా.

*సత్యనారాయణశాస్త్రి గారి మరణం మాకు తీరని లోటు. అన్ని వర్గాల ప్రజల పక్షాన ఏదొచ్చినా నేనున్నానని నిలిచే బ్రహ్మణ సంఘ నాయకుడు, గొప్ప వ్యక్తి ఆయన.* **–సూరంపూడి కామేష్,** తణుకు

*దశాబ్దాలుగా శాస్త్రీజీకి రాయపూర్‌తో అనుబంధం. దాదాపు మా కుటుంబం అన్నంత చనువు మాతో వారికి ఉండేది. రాధాశాస్త్రి దంపతులు మా కుటుంబ సభ్యుల్లానే ఉండేవారు, ఆయన మహోన్నతమైన మనిషి.*

*ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ హుందాగా గడిపేవారు. భౌగోళికంగా దూరమనే కాని మా మనసుల మధ్య అసలు దూరమే లేదు. ఆయన మరణం కూడా మహత్తరమైనది.* **–బబ్లూ గుప్తా,** రాయపూర్



వేరే ఆదాయం మార్గాలేవీ లేకపోయినా ఖర్చుకు మాత్రం వెనకాడేవాళ్ళం కాదు, నగలైనా బంగారమైనా మన అవసరాలకు ఉపయోగపడాలి గాని అలంకరణకు మాత్రమే కాదని మేమిద్దరం నమ్మేవాళ్ళం.

ఖచ్చితమైన ఆదాయం లేదని బయట చుట్టాలు అనుకున్నా మాకిద్దరికీమాత్రం ఆ వెలితి ఎప్పుడూ కనబడలేదు, ఇబ్బంది పడలేదు.

చిన్నాచితకా ఉద్యోగాల్లో నా సంపాదన మాఇద్దరి ఆర్థిక అవసరాలకూ సరిపోయేది కాదు సరిపెట్టుకునేవాళ్ళం!

చాలా మంది జీవితాల్లో ఆలోచనచేయడానికి కూడా భయపడే 'షష్ఠిపూర్తి మహోత్సవాన్ని' కూడా 2015 లో మేం జరిపించుకున్నాం మా ఇద్దరి ఇష్టంతోనే.

మాకిద్దరికి 'ప్రయాణం అంటే చాలా ఇష్టం' దాదాపు దేశం మొత్తం చుట్టేశాం. అలా మేం తిరిగగలిగేం అంటే కారణం మా అమ్మ పిల్లల్ని కంటికి రెప్పలా చూసింది కాబట్టే.

*రాధ నాకు ఆప్తమిత్రురాలు. రాయపూర్‌లోని ఉమాశంకర్ శుక్లా బాడాలో చిన్నప్పటి నుంచి కలిసే మా రెండు కుటుంబాలు కష్టసుఖాలను పంచుకున్నాం. శాస్త్రీజీది ఉత్తమ వ్యక్తిత్వం. ఆంధ్రాలో శాస్త్రీజీనే మాకు ధైర్యంగా ఉండేవారు. అలాంటి వ్యక్తి మరణం మాకు తీరని లోటు.* **– శ్రీమతి చందా,** రాయపూర్

మా పిల్లలు ముగ్గురికి చదువు విషయంలో మేం బాధ్యతారహితంగా ప్రవర్తించామనే అపవాదు మా బంధువుల్లో ఉంది.

పిల్లలను ఏం చదివించాలనే విషయం వచ్చినప్పుడు చదువు, పెళ్ళి లాంటి ముఖ్య విషయాల్లో వాళ్ళకు పూర్తి స్వేచ్ఛ ఇవ్వాలనుకున్నాం, అదే అమలు చేశాం!

మా పిల్లలు ముగ్గురూ...ఎప్పటికీ మా పిల్లలు గానే ఉండాలని ఉంచాలని మా ఇద్దరి ఆశ, ఆకాంక్ష.

మా పిల్లలు మనసు, మానవత్వం, స్పందించే హృదయం ఉన్న విలువలు గల పౌరులుగా వాళ్ళను చూడాలనుకుంటున్నాం, చూస్తున్నాం.

మేమిద్దరం మనకు ఏటియమ్ మిషన్స్ వద్దనుకున్నాం. అందుకే మా ఇంట్లో మా జీవితాల్లో ఏటియమ్ మిషన్ లేకుండా జాగ్రత్త పడ్డాం.

పూర్తి స్వేచ్ఛ స్వాతంత్ర్యం అనుభవిస్తున్నారు పిల్లలు, అనుభవించాలని కోరుకుంటున్నాం.

1986 తర్వాత నేను జీవితంలో ఏ నిర్ణయం తీసుకున్నా రాధ భాగస్వామ్యం ఉండేలా చూసుకున్నా, వ్యక్తిగా ఉన్నప్పటి స్వేచ్ఛ స్వాతంత్ర్యం వైవాహిక జీవితంలో కొంత మేర కోల్పోతాం.

**(మదర్స్‌డే రోజున గౌరవ్ రాసిన రైటప్‌కి స్పందనగా ఈ మూడు వ్యాసాలు బాంబూ రాసారు)**

*ఉద్యమాల పేరుతో పెద్ద పెద్ద కబుర్లు చెప్పేవారు చాలా మంది ఉంటారు. సమయం వచ్చినప్పుడు తెలుస్తుంది మనుషుల సత్తా. అలా పదేళ్ళ పాటు తనపైనా, పిల్లలు కుటుంబం పైనా అక్రమంగా అనేక తప్పుడు కేసులు పెట్టి వేధించినా లొంగకుండా నిలిచినయోధుడు 'బాంబు'. తగలేసినంత ధనమున్న వాళ్ళు ఎందరైనా ఉండవచ్చు. కానీ ధైర్యం ఉన్న ఉద్యమకారులు అరుదు. అలాంటి వ్యక్తి బాంబు. ఆ రోజుల్లో అందర్నీ తన పత్రికతో భయపెట్టిన ఎన్‌కౌంటర్ దశరధరామే బాంబు అక్షరసత్యాలకి భయపడి కోర్టుకెళ్ళి ఇంజక్షన్ ఆర్డర్ తెచ్చుకున్నాడంటే బాంబు ఎంతటి అక్షర ప్రభంజనమో చూడండి.* **– పెద్దా,** *విశాఖపట్నం*

# ఈ రోజు నా 'సహధర్మచారిణి' అనూరాధ జన్మదినం

'భార్య', 'పెళ్ళాం' 'అర్ధాంగి', ఇలా ఎన్నో ప్రత్యామ్నాయ పదాలు ఉన్నా ......అవన్నీ రాధకు ఆమె వ్యక్తిత్వానికి పరిపూర్ణ పదాలు కావన్నది నా అభిప్రాయం.



1986 సెప్టెంబర్ నెలలో మా 'వివాహానికి' నెల రోజుల ముందే 'నిశ్చి తార్థం' రోజు నా చెయ్యి పట్టుకుని నెలరోజుల తర్వాత నా జీవితంలోకి 'సహధర్మ చారిణి' హోదాతో ప్రవేశించిన 'చిట్టెళ్ళ అనూరాధ', 'మేకా అనూరాధ' గా రూపాంతరం చెందింది !

*మావయ్యతో నా అనుబంధం గురించి చెప్పాలంటే ముందుగా నేను మావయ్యకు కలిగించిన నష్టం గురించి చెప్పాలి, ఒప్పుకోవాలి. నా వల్ల మావయ్యకు ఎంతో ఇష్టమైన వ్యక్తి దూరమైనా సరే ఎప్పుడూ ఒక్కసారి కూడా నన్ను ద్వేషించలేదు. నాకు కలిగిన కష్టాన్ని తట్టుకోడానికి నాకు అండగా నిలబడ్డాడు. ఎంతో ఆవేశం కలిగిన మావయ్యలో అంత సహనం ఎక్కడ నుండి వచ్చిందో! చిన్నప్పుడు మావయ్యతో నా జ్ఞాపకాలంటే నన్ను ఎత్తుకుని తన స్నేహితుల ఇళ్ళకు తీసుకుని వెళ్ళేవాడు. తన కంచంలోంచి నాకు తినిపించేవాడు. నేను నిద్రపోవడానికి తత్వాలు పాడడం ఒక జ్ఞాపకం. ఇంకా ఎన్నో జ్ఞాపకాలు. నేను చదివిన మొదటి తెలుగు కథ పేరు "డోలు డోలుతో" మావయ్య నాకు సుమారు ఏడెనిమిదేళ్ళ వయసులో బాలమిత్రలో చదివించిన కథ అది. అప్పటి నుండే పుస్తకాలు, కథలు, సాహిత్యం చదవడం అలవాటైంది.*

**– మాధవి అని అంతా పిలుచుకునే పారిజాతం**

నాకు తెలిసినంత మటుకు, నా ఎరుకలో 'సహధర్మచారిణి' అనే పదానికి పరిపూర్ణ మైన 'రూపం' ఇస్తే .... రాధ లాగే ఉంటుంది

ఈ రోజు ఆమె 'జన్మదినం'. పరిపూర్ణ ఆయురారోగ్యాలతో సౌభాగ్యంతో ఆమె జీవితం నిండునూరేళ్ళూ ప్రశాంతంగా సాగిపోవాలని ఆమె సహచర్యంతో మా జీవితాలు ఆనందమయం కావాలని కోరుకుంటూ..... జన్మదిన శుభాకాంక్షలు అభినందనలు !



*"వివాహ వార్షికోత్సవం" ముప్పై ఐదు సంవత్సరాల క్రితం అంటే 1986 అక్టోబర్ నెల పన్నెండో తారికు సాయంత్రం 7 గంటల సమయంలో మా ఇరువురం వ్యక్తిగత 'స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు' కొల్పోఏం, ఆరోజు 'విజయదశమి' కూడా!*

*ఆనాటినుండి నేటివరకూ సుధీర్ఘ జీవన ప్రయాణం లొ నిరంతరాయంగా 'షడ్రుచులు' ఆశ్వాదిస్తున్నాం! భారతీయ వివాహ వ్యవస్త లొని 'మాధుర్యాన్ని," కుటుంబ వ్యవస్థ లోని 'మమకారాన్ని ' ఆశ్వాదించి అనుభ వించే అవకాశం మాకు కల్పించినందుకు మా పెద్ద లందరకూ.... సహాయ సహకారాలను అందిస్తున్న 'సహధర్మచారిణి' అనూరాధ కు అభినంద నలు, క్రుతజ్ఞతలు, శు భాకాంక్షలు.* **– బాంబు**

## ఒక్కసారి 'గట్టిగా మనస్ఫూర్తిగా 'ఏడవా' లని ఉంది' నాకు !

మనం ఎంత అసమర్దులమో అర్దమౌతోంది !

గడచిన ఇరవై మూడు రోజులుగా 'ట్రస్ట్ హాస్పిటల్' లో మా రాజు గాడు పడుతున్న బాధ చూస్తూంటే పగ వాడికి కూడా రాకూడదంత కష్టం అనిపిస్తోంది.



నా....పరిస్థితి చాలా 'విచిత్ర' మైనది. 'గంభీరంగా' కాకినాడ వెళ్ళి 'రవి' గాడిని చూసి వస్తున్నా

'నిస్తేజంగా', 'నిర్వికారంగా', 'కళ్ళు' మూసుకుని' 'యోగనిద్ర' లో ఉన్న 'ముని' లా, 'యోగసమాధి' లో ఉన్న 'ఋషి' లా ఉన్న 'రవి' గాడిని చూస్తూ ఉంటే .....

ఒక్కసారి 'గట్టిగా' మనస్ఫూర్తిగా "ఏడవా" లని ఉంది నాకు !

అందరూ వయసులో నా....కన్నా చిన్న వాళ్ళే.... వాళ్ళ ఎదురుగా... ఏడవలేక చస్తున్నా.

'గంభీరంగా' 'గుంభనం'గా 'ధైర్యం' గా ఉన్నట్లు నటించేస్తున్నా. రవి గాడిని వాడి 'తపస్సు' ను చూసి వచ్చిన దెగ్గిర నుంచి !

*ఆయన ఒక స్నేహితుడి తండ్రయినా కూడా ఎప్పుడూ మా తండ్రిలానే నా బాగోగులన్నీ అడుగుతూ నా శ్రేయోభిలాషిగా, అవసరమైన సలహాలు, సూచనలు ఇస్తుండేవారు. ఆయనెప్పుడూ ప్రజలతో మమేకమై ఉండేవారు. ఎటువంటి స్వార్థం లేకుండా ఏదైనా మంచి చేయాలని తపించే వ్యక్తాయన. అందుకే ఆయన వ్యక్తిత్వం అంటే నాకు గౌరవం, ఇష్టం.* ***-గోకాడ శ్రీనివాస్,*** *విజయనగరం*

*ఇతర మిత్ర బృందం*

ఛి...ఛి...ఛీ..... స్వేచ్ఛ...... గా...... ఏడవ లేక పోవడాన్ని మించిన 'దౌర్భాగ్యం' మనిషికి మరోటి లేదనే 'నగ్న సత్యం' ఇప్పుడే తెలిసింది!

ఏడుపు ఎంత " పవిత్ర " మైనది ?

## నా జాతకం

2002-2-2 ఈ జాతకంలో అంతర్దశలు వ్రాస్తూ జాతక రచయిత రెండుసార్లు 'స్టార్లు' వేసి "బి కేర్‌ఫుల్" అని వ్రాయడం జరిగింది!

సుమారు ముప్పై సంవత్సరాల క్రితం ఆంధ్రభూమి వారపత్రికలో 'జన్మ కుండలినీ' వ్రాసిన జోతీష్కుడు 'రమేష్ చంద్ర మహర్షి' నా వ్యక్తిగత జాతకం వ్రాసి ఇస్తు....... అంతర్దశ లో వ్యక్తీకరించిన అభిప్రాయం ఇది !

నా జాతక రీత్యా..... 2002- 2-2 నుండి 2002 -6-8 వరకూ చాలా జాగ్రత్తగా ఉండాలి అని రెండు నక్షత్రం గుర్తులతో నన్ను హెచ్చరించడం జరిగింది !

సుమారు ముప్పై సంవత్సరాల క్రితం వ్రాయబడ్డ సదరు హెచ్చరికను

*బాంబు అని అందరూ గౌరవంగా, అభిమానంగా, ఆప్యాయంగా పిలుచుకునే ఎంఎస్ఎన్ శాస్త్రిగారు మాకు మేనమామ. ఈ సందర్భంలో ఆయనతో వ్యక్తిగత సంబంధాన్ని లేదా చుట్టరికాన్ని స్మరించుకోవాలా లేదా ఆయన ఉన్నత వ్యక్తిత్వాన్ని గుర్తు తెచ్చుకోవాలా అనే సందిగ్ధత నాలాగే బహుశా అనేకమందికి కలిగి ఉండచ్చు. ఎందుకంటే వ్యక్తిగా, వ్యవస్థగా కూడా ఆయన ఉన్నతుడే. తండ్రి తరువాత తండ్రి అంతటి వారు అని మనం కొందరిని గురించి కొన్ని సందర్భాల్లో వాడుతుంటాం. మావయ్య కొన్ని సందర్భాలలో నాకు ఆ మాటకొస్తే మా కుటుంబాలలో చాలా మందికి తండ్రి కంటే ఎక్కువగా అండగా నిలిచారు. ఆడపిల్లలని ఎంత అపురూపంగా గౌరవంగా, అభిమానంగా ట్రీట్ చేయాలో మామయ్య నించే ఎవ్వరైనా నేర్చుకోవాలి (నా దృష్టిలో) ఒక్క మాటలో చెప్పాలంటే మావయ్యని కోల్పోవడంతో నేను ఒక "లైఫ్ డిక్షనరీ"ని పోగొట్టుకున్నాను.*

***-లత అని అందరూ పిలుచుకునే స్వర్ణలత***

నేను 20 సంవత్సరాలు గుర్తించలేదు

ఇంట్లో పుస్తకాలు సర్దుతూ......ఉంటే.... జారిపడ్డ...... కాగితాల్లో.... కనబడ్డ ఆ అమూల్య సలహా, సూచన హెచ్చరిక ఇది !

అప్పటికే జీర్ణావస్తకు చేరుకున్న సదరు కాగితాన్ని 'సంస్కరించి' భద్రపరచడం జరిగింది.

ఆ జన్మ కుండలిని వ్రాసిన 'రమేష్ చంద్ర మహారుషి. ఇప్పుడు వారు భక్తి టివిలో "జన్మకుండలిని" కార్యక్రమం నిర్వహిస్తున్నారట

ఇరవై సంవత్సరాల పాటు నేను గుర్తించ లేకపోయిన వాస్తవం ఏంటంటే....... 2002-2-2 సాయంత్రం ఏడుగంటల సమయంలో పిఠాపురం "శ్రీ పాద శ్రీ వల్లభ సంస్థాన్ " లో నాకు "హార్ట్ ఎటాక్" వచ్చింది ఒక మీటింగ్ లో ఉండగా

నేను ఇప్పటివరకు ఈ ముప్పై సంవత్సరాలలోనూ ఎప్పుడూ...... సదరు జాతకరచయిత శ్రీ రమేష్ చంద్ర మహరుషిని కలవలేదు, ఫోన్లో మాట్లాడలేదు.

నిన్న ఉదయం నుంచి ప్రయత్నం చేస్తూ ఉంటే.... ఇప్పటిదాకా వార్ని కలవలేక పోయాను ఫోన్లో కూడా

నిజంగానే గడచిన మూడు దశాబ్దాలుగా రమేష్ చంద్ర మహరుషి "జన్మ కుండలినీ" ద్వారా "తపస్సు" చేస్తున్నారేమో అనిపించింది.

ఆయన అనుమతిస్తే..... నా

ఆరోగ్యం సహకరిస్తే .... త్వరలోనే వారిని కలిసి ముప్పై సంవత్సరాల క్రితం వారిచే వ్రాయబడ్డ సదరు హెచ్చరికను వారికి చూపించి అభినందనలు తెలిపి రావాలని కోరిక.

నేను రమేష్ చంద్ర మహరుషి జన్మ కుండలినీ జోతీష్కాలయానికి ప్రమోటర్‌ను కాదు, వాస్తవాన్ని మీ ముందు ఉంచాలన్నదే నా ఈ ప్రయత్నం!

## 'బూస్టర్ డోసు-ఈ మాట ఈ మధ్యకాలంలో అందరి నోటా వినబడుతోంది!

కరోనా వైరస్ టీకాలు రెండు డోసులూ వేయించుకున్నాక కూడా కోవిడ్ కొత్త వేరియంట్ ను ఎదుర్కోవడానికి ప్రపంచ ఆరోగ్య సంస్థ తాజా నిర్ణయం 'బూస్టర్' డోసు !

30/11/2015 మా 'షష్టిపూర్తి' జరిగింది



70 సంవత్సరాల వయస్సులో నిర్వహించుకోవాల్సిన ''బ్రహ్మారధి'' అన్నీ అనుకూలిస్తే ...ఆరోగ్యం సహకరిస్తే.....2025 నవంబర్ నెలలో చేసుకోవాలనుకుంటా....

ప్రస్తుత కరోనా పరిస్థితుల్లో.... వయసుతో సంబంధం లేకుండా రెండో కంటికి తెలీకుండా జనాలు పిట్టలకన్నా ఘోరంగా రాలిపోతూ.... ఉంటే కరోనా కట్టడికి ప్రపంచ ఆరోగ్య



సంస్థ 'బూస్టర్ డోసు' ప్రోత్స హిస్తోంది!

2025 సంవత్సరం 'మా 70 సంవత్సరాల బ్రహ్మరధి' నిర్వహించుకోడానికి ....

"బూస్టర్ డోసు"గా

మెన్న 13/01/2022 "వైకుంఠ ఏకాదశి " రోజున మా ఇంట్లో 'ఆయుష్ హోమం', మృత్యుంజయ హోమం రుద్రాభిషేకం, పాశుపతం లాంటి " బూస్టర్ డోసు" లన్నీ మాచేత చేయించేసేడు మేనల్లుడు శంకర్ ఆ సందర్భంగా తీసిన ఫొటో.



*పండుగ సందర్భంగా పిఠాపురం లో మా ఇంట్లో రాధ వాళ్ళ అమ్మ, అక్క, గౌరవ్, కళ్యాణి, కూతురు సుజాత, శ్రీను, రాజా, వైష్ణవి, తేజ, సోము సుధీర్.* **– బాంబు**

***Photo by : Rohit***

# షష్టిపూర్తి ప్రత్యేక సంచికలోని వ్యాసాలు

## పోటెత్తిన సముద్రపు ప్రచండ హోరు!

## పోరాటమే చిరునామా 'బాంబు' అతని పేరు!!

"బాంబుని చూడగానే

బెంబేలు పడితే

అదెప్పుడూ నీ గుండెల్లోనే పేలుతుంది"

–అలిశెట్టి ప్రభాకర్

## 1984వ సం॥రం 'సత్యనారాయణశాస్త్రి@బాంబు'

రాష్ట్రంలో ఎటు చూసినా అదే చర్చ. ఏ నలుగురు కలిసినా అదే ప్రశ్న. ఎవరీ 'బాంబు'? అర్థ దశాబ్దంగా ఎంతోమంది రాజకీయ నాయకులపైనా, సెలబ్రిటీలపైనా, ఇంకా సమాజంలో గొప్పవాళ్ళుగా, పెద్ద మనుషులుగా చలామణీ అవుతున్న బడాబాబుల్నీ, నలుగుర్లో పెట్టి నిగ్గదీస్తూ బజార్లో పెట్టి బండబూతులు తిడుతూ బెంబేలెత్తించి అతి తక్కువ కాలంలోనే అత్యధిక సర్క్యులేషన్ పెంచుకుని, యావదాంధ్రదేశంలోనూ ఎంతోమంది వీరాభిమానుల్ని సంపాదించుకుని తెలుగు జర్నలిజం చరిత్రనే తిరగరాసిన ఎన్‌కౌంటర్ పత్రిక ఎడిటర్ పింగళి దశరథరామ్ పై పుస్తకం రావడం, దాని రచయిత బాంబు కావడం.

*ముప్పై ఐదేళ్ళ బంధం మాది. ఈ మూడు దశాబ్దాలుగా ఆయనే నా ప్రపంచం. ఎక్కడో రాయపూర్‌లో పుట్టి పెరిగిన నాకు ఈ ముప్పై ఏళ్ళకు పైబడి ఈ పిఠాపురమే లోకమైంది. ఆయనతో కష్టసుఖాలను పంచుకోవడమే జీవితం అయ్యింది. మంచిచెడ్డలన్నీ కలిసే పంచుకున్నాం. ఆయన ఎప్పుడూ తిండికి, గుడ్డకీ లోటు లేకుండా చూసారు. ఇంటికి ఎవరు ఎప్పుడు వచ్చినా లేదనకుండా ఉన్నదాంట్లోనే సంతోషంగా పెట్టారు. చివరి వరకూ ఆయన ఎలా బతకాలనుకున్నారో అలాగే బతికారు. ఎలా పోవాలనుకున్నారో అలాగే పోయారు.* ***–అనూరాధ*** *(అర్ధాంగి)*

# అనురాధ - సత్యనారాయణశాస్త్రిల షష్టిపూర్తి మహోత్సవం

విద్యార్థిగా 'బాంబు'

శాస్త్రి-అనురాధల సంతానం

అలనాటి మిత్రబృందం

వివాహ వేడుకలో...

తాళికట్టు శుభవేళ...

శాస్త్రి అత్తమామల షష్టి పూర్తి వేడుక

అర్ధాంగితో అమర్‌నాథ్ యాత్రలో...

యువకునిగా 'బాంబు'

సతీసమేతంగా శాస్త్రి మిత్రులు

శాస్త్రి తల్లిదండ్రుల షష్టిపూర్తి సందర్భంగా...

## వివాహ విశిష్టత

### షష్టిపూర్తిని కూడా వివాహంగా పరిగణించే పరిస్థితిలో వివాహ పరిణామాన్ని పరిశీలించే ప్రయత్నమే ఈ వ్యాసం...

మానవజాతి చరిత్రలో వివాహమనేదొక విప్లవం. సాంఘిక కోణంలోనూ, చారిత్రక దృక్కోణంలోనూ మానుష లైంగికత వివాహంతోనే నైతికతను సంతరించుకుంది. ఎంతమందితోనైనా సంగమించవచ్చనే ఆటవిక దశనుండీ, ఎన్ని మనువులైనా చేసుకోవచ్చనే అనాగరికత నుండీ స్త్రీ పురుషులు భార్యాభర్తలుగా కల్సి జీవించాలనే దృక్పథం ప్రగతిశీలమైంది. అందుకే, వివాహమనేది లైంగిక నాగరికతకి నాంది.

మహా కాలప్రవాహంలో మనం జీవించే కొద్దిపాటి సమయంలో సగభాగాన్ని మరో అంతరాత్మకు సమానంగా పంచి ఇరువురు కల్సి ఇష్టాయిష్టాల్లో భాగం పంచుకుంటూ పయనించడమే పెళ్ళనే అద్భుతమయిన ఆలోచనకు నాంది. అలౌకికమైన అనుభూతుల లోతుల్లో తియ్యని జ్ఞాపకాల చిరుకోపాల్ని సిగ్గుల్తో హద్దుమీరి కురిపిస్తూ మహదానందమైన మరో ప్రపంచానికి నవవధూవరుల్ని వయ్యారంగా తీసుకెళ్ళే పసందైన భావనే పెళ్ళికి పునాది.

లేలేత సూర్యకిరణాల నులివెచ్చని వెలుగులు సుతిమెత్తని మంచు బిందువుల్తో కల్సి ఇరువుర్ని ప్రకృతి ఒడిలో స్వయంవరానికి సిద్ధంచేసే సంతోషకరమైన సన్నిధి వివాహమనే అమోఘమైన అలంబనకు ఉగాదైతే, పచ్చని తోరణాల పెద్దరికానికి తలొగ్గి, పురివిప్పి నాట్యం చేసే నెమళ్ళ వినూత్న భంగిమలకు తాళం వేసే కోయిలల కూనిరాగాల్ని ఒళ్ళంతా పూర్తిగా విప్పుకుని, మనసంతా తెరిచి ఆర్తిగా జుర్రుకునే ఆకాశపక్షుల పెన్నిదే పెళ్ళనే ఆనందమయిన ఆరంభానికి పురవీధి.

పెళ్ళంటే ఒకరితో ఒకరు కల్సి బతకడమే కాదు, ఒకరికొకరు లేకుండా బతకలేపోడం. పెళ్ళంటే మనతో జీవించే అవకాశాన్ని మరొకరికి ఇవ్వడమే కాదు, మరొకరికోసం జీవించే అవకాశాన్ని మనం అందుకోవడం. పెళ్ళంటే మనం ఇష్టపడే వ్యక్తిని ఎన్నుకోవడమే కాదు, మనల్ని ఇష్టపడే వ్యక్తిని ఎంచుకోవడం. పెళ్ళంటే మన అనుభూతులకు నచ్చిన రూపాన్ని పొందడమే కాదు, మరొకరి అభిప్రాయాలకు అనుగుణంగా ఆలోచనల్ని కుదుర్చుకోవడం. పెళ్ళంటే మన ఆశల్ని నెరవేర్చుకోడమే కాదు, భాగస్వామి నిరాశలో సైతం భాగం పంచుకోవడం. పెళ్ళంటే మన ఆశయాలకు మరొకర్ని బద్దుల్ని చేయడమే కాదు, మరొకరి ఆకాంక్షల్లో మనం కూడా మమేకమవడం.

అనాదిగా దాంపత్య జీవనం సుఖంగా సాగడానికి సామాజిక పరిణామంలోంచొచ్చిన ప్రతి ప్రవక్తా ప్రవచించిన సత్యమిదే. కాలమానాలకతీతంగా, కొలమానాలకందని వివాహబంధం సక్రమంగా జరగడానికి సత్యాన్వేషణకోసం తపించిన ప్రతివేత్తా ప్రతిపాదించిన నిజమిదే. యుగయుగాలుగా మనిషి సంఘర్షణకు సవాలు విసిరే విశృంఖలత్వాన్ని ఛేదించుకుంటూ వ్యవస్థ నవీనత్వంలోకి ప్రవేశించడానికీ, శతాబ్దాలుగా మానవ మేధో ప్రయత్నాలకు అడ్డుకట్ట వేసే లైంగికోద్రేకాలకు నిర్మాణాత్మక నివారణను సాధించడానికీ, మహోన్నతమైన మానవ మస్తిష్కంలో ఎన్నడో జనించి ఈనాటి భావితరాల విశ్వాసంలో సైతం తప్పనిసరి భాగమైన వివాహమనే స్ఫూర్తే సుస్థిరకారణం.

వివాహం విశ్వాసం పునాదిగా జరగవలసినది. వివాహం విచక్షణే ప్రధానంగా చేయవలసింది. వివాహం వివేచనే ముఖ్యంగా గడపగలిగినది. వివాహం వాత్సల్యమే వారధిగా వుండదగినది. వివాహం సమైక్యతే సారధిగా సాగాల్సినది. వివాహం విముఖతకు విరుద్ధంగా ఎంచగల్గినది. వివాహం విభిన్నతే ప్రధానంగా చేసుకోదగింది. వివాహం విలక్షణంగా సులక్షమనదగినది. వివాహం విజ్ఞతే మార్గంగా నడవదగినది. వివాహం కలకాలం విజయవంతంగా నిలువదగినది.

ఒకరికోసం మరొకరు అహాన్ని వీడటమే వివాహానికి ప్రధాన సూత్రం. ఒకరికొకరు మర్యాదగా మసులుతూ జీవితాన్ని పంచుకోడమే పెళ్ళికి ప్రారంభ మార్గం. అవసరమైతే ఒకరు ఒదిగి మరొకరు ఎదగడానికి అవకాశం కల్పించడమే త్యాగం. ఒకరి అభ్యున్నతిని మరొకరు మనసారా కాంక్షించడమే బంధం. అన్ని రకాల వివాదలకూ మంగళం పాడి, ఎన్ని విధాల అడ్డంకులనైనా అధిగమిస్తూ, ఆత్మస్తుతి పారాయణుల మాటలకు పొంగిపోకుండా, అక్కుపక్షి నారాయణుల కోతలకు కృంగిపోకుండా, అక్కర్లేని ఆవేశాలకూ, అత్యుత్సాహపు ఆగడాలకూ లొంగిపోకుండా, అర్ధంలేని ఆడంబరాలకో, అపార్ధమైన అనుమానాలకో ఒంగిపోకుండా ఇరువురు కలగలిసి చివరి వరకూ నడవడమే అన్యోన్య కాపురానికి సిసలైన క్షేత్రం. కలిసి జీవించడానికి శరీరాలు చాలు, కాపురం చేయడానికి మాత్రం హృదయాలు కావాలి.

మనిషి చేసిన సుదీర్ఘ ప్రయాణంలోని అనుభవాల లోతులు ఎప్పుడూ అతని ఆంతరిక చైతన్యాన్ని ప్రజ్వలింపచేయడానికి ప్రయత్నిస్తూనే ఉంటాయి. మరో మనిషి అస్తిత్వాన్ని గురించి కూడా పవిత్రంగా ఆలోచిస్తూ మనసావాచా కర్మేణా మరో మనిషిని ప్రేమిస్తూ, జీవితాంతం ఇరుప్రేమికులు కలిసి బతకాలనే భావాల్ని పునరుత్తేజం కావించే వివాహబంధాలు ఎల్లప్పుడూ వాటి గాఢమయిన గాధల్ని విస్తరిస్తున్న కాలంతోబాటు వినమ్రంగా భవిష్యత్తుకు వినిపిస్తూనే ఉంటాయి. మానవుడ్నే మహనీయుడిగా, మానవత్వాన్నే దైవత్వంగా మనసులో పదిలపరుచుకుని ముందుకు సాగిన దాంపత్య జీవన మార్గాలన్నీ ఏవేదరికి చేరినా, మహోన్నతమైన కుటుంబ చిహ్నాల్ని చిరస్థాయిగా చరిత్రలో పరిరక్షిస్తూనే ఉంటాయి. ప్రజానీకంలో వ్యక్తుల జీవితాలను ప్రతిబింబించే సాంఘిక ఔన్నత్యానికి సమాజ గమనంలో సామరస్య సహజీవన భరిత వివాహ బంధాల్ని మించిన సజీవ సంకేతం లేదు.

- అమర్

వక్తగా...

పాత్రికేయుడిగా...

శాస్త్రి సోదరి కీ.శే. భాగ్యలక్ష్మి

శాస్త్రి అర్ధాంగి అనూరాధ

ఉండవల్లి అరుణకుమార్‌తో శాస్త్రి కుటుంబం

స్వాతంత్ర్య సమరయోధులు, ప్రముఖ సోషలిస్టు నాయకులైన కంవాళ సుబ్రహ్మణ్య తిలక్, కాంతం దంపతులతో శాస్త్రి, రాధ దంపతులు

సంతానంతో శాస్త్రి సోదరి కీ.శే. భాగ్యలక్ష్మి

బాంబుని ఉద్యమానికి సంసిద్ధుణ్ణి చేస్తున్న రాధ

నాదెండ్ల భాస్కరరావు వారి సతీమణి, కృష్ణబాబుగారితో 'బాంబు' కుటుంబం

మరింత ఆశ్చర్యం ఏమంటే స్టేట్ లీడర్లు మొదలుకుని మహామేధావుల దాకా ఎవరినీ వొదిలి పెట్టకుండా వాళ్ళ ప్రైవేట్ జీవితాల మీద కూడా లెక్కలేనన్ని ఆరోపణలు చేసిన ఎన్‌కౌంటర్ ఎడిటర్, రాష్ట్ర వ్యాప్తంగా లక్షలాదిమంది యువజనుల్ని తనవైపు తిప్పుకుని, ఎంతోమంది దృష్టిని తన రాతల ద్వారా ఆకర్షించిన దశరథరామ్ 'బాంబు' రాసిన చిన్న పుస్తకం ప్రింటు కాకముందే ఆపాలని స్వయంగా కోర్టును ఆశ్రయించి, బాంబును అరెస్టు చేయించడం, ఎంతోమంది హేమాహేమీల్ని గడగడలాడించిన దశరథరామ్‌పైనే అక్షరాలెక్కు పెట్టే సాహసం చేసిన ఆ 'బాంబు' ఎవరని అంతటా ఆసక్తి నెలకొంది.

"దుర్మార్గపు రాతలతో తెలుగుదేశంలో తెలుగు పాఠకుడ్ని తెలివితక్కువవాడిగా అంచనావేస్తూ యువతరాన్ని అతి దారుణంగా భయంకరంగా తప్పుదారి పట్టిస్తూ అదే రహదారని అపోహ కల్గిస్తోన్న ఓ పత్రికాధిపతి నిజచరిత్రే ఈ పుస్తక"మంటూ, ఎన్‌కౌంటర్ దశరథరామ్ బండారం" పేరిట గర్జించిన ఆ గొంతు తర్వాతి చరిత్రలో దశరథరామ్‌తో మిత్రత్వాన్ని కొనసాగించినప్పటికీ ముష్కర మూకల చేతిలో ఆయన



బలైపోయిన దు:ఖంతో చాలాకాలం మౌనం దాల్చింది. ఐనప్పటికీ ప్రశ్నించేవాళ్ళు ఎంతోసేపు చేతులు ముడుచుకోలేరు. అందుకే నెమ్మదిగానైనా తర్వాతర్వాత తిరిగి తన ప్రయత్నాన్ని ఆరంభించింది. ఎందుకంటే, ఎవరో అన్నట్లు "ప్రయాణారంభాన్ని మర్చిపోతే గమ్యం శిధిలమవుతుందని" తెలిసి.

తెలుగు పత్రికారంగ చరిత్రలో కమెండో, ఎన్‌కౌంటర్, విజయ విహారంలాంటి పత్రికలది చిరస్థాయి. బాలగోపాల్ మొదలుకుని రమణమూర్తి గారి దాకా ఈ ఎన్‌కౌంటర్‌ను ప్రస్తావించారంటే ఎంతో కొంత ప్రజాపక్షం వహించని పాత్రికేయత్వానికి అది సాధ్యమని నేననుకోను. పురాతన చారిత్రక తెలుగు పత్రికల్ని (కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక మొదలగునవి) డిజిటలైజేషన్ చేసే కార్యక్రమాన్ని ప్రభుత్వశాఖొకటి ఎత్తుకొందని తెల్సి వాటితోబాటూ ఎన్‌కౌంటర్, కమెండో పత్రికా సంచికల్ని కూడా సంరక్షించే బాధ్యత వారిపైనుందని గుర్తు చేస్తూ లేఖ రాస్తే ఇప్పటిదాకా జాడ లేదు. జవాబూ రాలేదు. ఏదేమైనా తీవ్రవాద ధోరణి ఉన్నంతలో అక్షరాలు అంటరానివైపోవు. ఇంతకీ ఆనాడతంత చర్చరేపిన ఈ 'బాంబు' ఎవరసలు?

4-12-55న పార్వతీపురంలో మేకా కృష్ణమూర్తి, కృష్ణవేణి దంపతులకు రెండో సంతానంగా పుట్టారు. (మొదటి పిల్ల కీ॥శే॥ కందాళ భాగ్యలక్ష్మి). మొదట్నుంచీ దుందుడుకు స్వభావం. కృష్ణమూర్తిగారిది రాజాం.



చిన్నప్పుడే ఇంట్లోంచి పారిపోయి మద్రాసులో ప్రసిద్ధ రాజకీయ నాయకుడు వి.వి.గిరిగారి వియ్యంకుడైన డాక్టరు రాంజీ గారి వద్ద చాలా కాలముండి ఫార్మశీ చేశారు. ఆ క్రమంలో వివాహానంతరం ఉద్యోగవశాత్తూ తూర్పుగోదావరి జిల్లా కిర్లంపూడి షుగర్ ఫ్యాక్టరీలో జాయినై పనిచేస్తుండగా ఆ ఫ్యాక్టరీని పిఠాపురానికి తరలించడం జరిగింది. అలా ఆ కుటుంబానికి పిఠాపురంతో ఏర్పడిన అనుబంధం ఈనాటికీ గాఢానుబంధమై కొనసాగుతోంది. బాంబు ఇంటర్ దాకా పిఠాపురంలో చదివి, డిగ్రీ కాకినాడలో చేసారు. ఆ క్రమంలో విజయవాడ స్పెన్సర్‌లో పనిచేస్తుండగా భావోద్యమకారులతో పరిచయమేర్పడింది. అలా కత్తి పద్మారావు, రావిపూడి వెంకటాద్రి, వెనిగళ్ళ సుబ్బారావు, చార్వాక రామకృష్ణ మొదలగువార్తో కల్సి పనిచేశారు. ఆ క్రమంలో పింగళి దశరథరామ్‌తో కల్సి ఎన్‌కౌంటర్ చాలా కాలం నడిపారు. ఆ సమయంలోనే రాష్ట్ర వ్యాప్తంగా నున్న ఎంతో మంది విప్లవకారుల్నీ, ఉద్యమకారుల్నీ, రాజకీయవేత్తల్నీ కల్సి వారితో అనుబంధం పెంచుకున్నారు. అలా నల్లపురెడ్డి శ్రీనివాసరెడ్డి, నాదెండ్ల భాస్కరరావు మొదలైనవారితో బాగా పరిచయం వుండేది. నాదెండ్ల భాస్కరరావు వేమూరులో పోటీ చేసినప్పట్నుంచి తెలుసు. పింగళి దశరథరామ్ రాజమండ్రిలో పోటీ చేసినప్పుడు శాస్త్రి ఇండిపెండెంటుగా పిఠాపురంలో పోటీ చేశారు. అలాగే ఎన్టీఆర్ ద్రోహంతో టిడిపి విడిపోయినప్పుడు నాదెండ్ల స్థాపించిన ప్రజాస్వామ్య తెలుగుదేశం అభ్యర్థిగా మరోసారి పోటీ చేశారు. బాలయోగి గురించీ ఎంతో

*బాంబుగారు మాకు గురుతుల్యులు. అను నిత్యం ప్రజల కోసం, ప్రజల మధ్య బతికిన అలాంటి గొప్ప వ్యక్తి విగ్రహం ప్రజలకి స్ఫూర్తి. కాన పిఠాపురం లో అందుకోసం స్థలం కేటాయిస్తే నేను విగ్రహం చేయించడానికి సిద్ధమని ప్రకటిస్తున్నాను. ఆయన ఆశయాల సాధనలో భాగంగా ఆయన మూర్తిని ఆవిష్కరించుకొని,దాని బాగోగులు చూడటం అభిమానులుగా మనందరి కర్తవ్యమని నా అభిప్రాయం.*

**– దొడ్డి రమణ,** *వైజాగ్*

పరిశోధించి ఎన్నో విషయాలు సేకరించి 'బాంబు బాలయోగి బండారం' అనే పరిశోధక పుస్తకం రాస్తే దశరథరామ్ తన పేరుతో ప్రచురించుకోవడమై దశరథరామ్‌తో విభేదించి ఏకంగా 'ఎన్‌కౌంటర్ దశరథరామ్ బండారం' అనే రచన చేశారు. రాష్ట్రవ్యాప్తంగా హాట్‌కేకుల్లా అమ్ముడుపోయిన ఆ పుస్తకాలు 'బాంబు' సత్తాను చాటాయి. ఈ విషయమై దశరథరామ్ హైకోర్టులో వేసిన కేసును ప్రముఖ న్యాయవాది ఆచంట లక్ష్మణరావు గారి సహకారంతో తానే స్వయంగా వాదించుకుని శాస్త్రి గెలవడం ఆ రోజుల్లో ఒక సంచలనం.

1986లో రాధను వివాహం చేసుకున్న తర్వాత సుమారు దశాబ్దం దాకా సామాజిక రంగాల్ని పట్టించుకున్నట్లు కనబడదు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు కె.ఎస్.తిలక్‌గారితో కలిసి 'స్పందన' గిరిజనాభివృద్ధి సంస్థను శంఖవరం మండలం పెదమల్లాపురం గ్రామంలో స్థాపించి వారితో కల్సి కొంతకాలం పనిచేశారు. అలాగే ఎ.వి.కె.చైతన్యగారి ప్రభావం కూడా బాంబుపై ఉండేది. ఆయన బాంబుకి వరుసకి మామయ్య. 95లో కిర్లంపూడి షుగర్ మిల్స్ నుంచి వస్తోన్న ప్రమాదకరమయిన బూడిదకు వ్యతిరేకంగా పర్యావరణ కాలుష్యానికీ, జీవుల ఆరోగ్యానికి హానికరమైన దానిపై శాస్త్రి (బాంబు) చేసిన 7 రోజులు ఆమరణ నిరాహార దీక్ష ప్రజానీకాన్ని ఒక్క ఊపు



*నాపక్కన అక్క భాగ్యలక్ష్మి, (ఇప్పుడు లేదు) మధ్యలో కూర్చున్నది మా అరుణక్క అటు పక్క మా 'అమల అశోక్' వెనుక వరస లో మధ్యలో నిలబడి మా అమ్మ కృష్ణవేణమ్మ! ఇంతకీ నేనెక్కడో చెప్పలేదు కదా మా అరుణక్క కూర్చున్న కుర్చీ మీద మోచెయ్యి ఆనుకుని నిలబడ్డ శోట్టోడి ని నె....నే.*

***- బాంబు***

*అందుబాటులో ఉన్న నా అతి 'పిన్న వయసు' ఫొటో*

ఊపింది. రైతు కార్మికులు, బడుగు బలహీన వర్గాల ప్రజల కోసం ఆయన పడ్డ ఆతృత ఆ ఉద్యమంలో ప్రతిబింబించింది. అలాగే 2004లో అధిక విద్యుత్ బిల్లులపై ట్రాన్స్‌కో తీరుకు నిరసనగా మరోసారి ఆమరణ నిరాహార దీక్ష చేశారు. అలాగే 2009 లో కె.జి.గ్యాస్ నిక్షేపాలను జాతీయం చేయాలని నిరాహార దీక్ష చేశారు. జాతీయ సమస్య అయిన కె.జి.బేసిన్ అంశం తప్ప మిగిలిన రెండుసార్లూ శాస్త్రి ఘనవిజయం సాధించారు. ఇవిగాక అనేక సాంఘిక, సాంస్కృతిక, ప్రజా ఉద్యమాల్లో మొదట్నుంచీ కీలకపాత్ర

*తన జీవితమంతా బెదురు, బెరుకు లేకుండా తన తల్లిదండ్రులు నమ్మిన సిద్ధాంతాలకు లోబడి, తన అభిప్రాయాలు తనకు మాత్రమే కాదు అందరికీ ఉపయోగపడేలా అనునిత్యం శ్రమిస్తూ తన మేధస్సునే తన కుమారులకు ఆస్తిగా ఇచ్చి, చివరి వరకు తన సంపాదన పై తను జీవించి, పత్రికా, న్యాయ, రాజకీయ రంగాలలో తనకంటూ ఒక ప్రత్యేక గుర్తింపుతో మరణమును కూడా అనేకమార్లు ఎదిరించి, చివరిగా ఆ మృత్యువును సైతం చిరునవ్వుతో స్వాగతించిన నాన్న.....మా నాన్న!*

***– మేకా కృష్ణ రోహిత్,*** *S/o మేకా సత్యనారాయణశాస్త్రి @ బాంబు*

*బతికినంత కాలం గొప్పగా బతికాడు మా నాన్న. డబ్బులకీ, ఆస్తులకీ, కులమతాలకీ ఎప్పుడూ ప్రాధాన్యత ఇవ్వలేదు. చదువు, ఉద్యోగం, పెళ్ళి ఇలా అన్నింటిలోనూ మా అభిప్రాయాలకి ఎప్పుడూ అడ్డు చెప్పలేదు. మీ జీవితం, మీ ఇష్టం అనేవారు. మా నుండి ఎప్పుడూ ఏమీ ఆశించలేదు. జీవితకాలం సంపాదన చుట్టూ తిరిగితే ఇంకెప్పుడు సంతోషంగా ఉంటాం? అనుకున్నాడేమో! ఆస్తులేమీ సంపాదించలేకపోయినా మంచి పేరు సంపాదించుకున్నాడు. ఉన్నంతలో తనకి నచ్చినట్లు బతికాడు. ఏ జబ్బుకీ భయపడలేదు. ఏ డాక్టరు మాటా వినలేదు. కొన్ని సందర్భాలలో సిగరెట్ మానేయమని మా అమ్మ చెబితే 'మానేస్తే ఓ రెండు రోజులు ఎక్కువ బతుకుతానేమోగాని కాలిస్తే ఈ క్షణం సంతోషంగా ఉంటా' అనేవారు. నిజమే కదా అనిపిస్తుంది. మా నాన్న నాకు ఆస్తులు ఇవ్వకపోయినా ఎక్కడికి వెళ్ళినా బతికే నమ్మకం, ధైర్యం ఇచ్చాడు. అది చాలు ఈ జీవితానికి. మా నాన్నపై నా అభిప్రాయాలకి అంతం లేదు. జ్ఞాపకాలు మాత్రమే ఉన్నాయి. మీతో పంచుకోవడానికి.* ***–కృష్ణ తేజ (తేజు)*** *S/o మేకా సత్యనారాయణశాస్త్రి @ బాంబు*

పోషించారు. అనారోగ్యం కారణంగా కార్యక్రమాలు కుంటుపడినప్పటికీ మానసికంగా ఎవరే సమస్యంటూ ఆయన వద్దకొచ్చినా వెంటనే స్పందించడం ఆయన స్వభావం. సొంతంగా ఈనాటికీ సెంటు భూమి లేకపోయినా అంతకన్నా ఎన్నో రెట్లు ఆత్మీయతానురాగాలుగల శ్రేయోభిలాషుల్ని సంపాదించగలిగానని గర్వంగా చెప్పుకుంటారాయన. తల్చుకుంటే ఒకప్పుడు తరాలు గడిచినా తరగని ఆస్తిపాస్తులు ఆయనకు దక్కేవి. రాజకీయంగా ఉన్నతస్థానమూ దక్కేది. కానీ, పదిమంది బాగు కోసం పాటుపడ్డం కంటే అవేమీ పెద్దగా ఆయన పట్టించుకున్నది లేదు. మూడుసార్లు దేశానికి ప్రధానిగా చేసి ఇంటికి అద్దె కట్టనందుకు నడివీధిలో నిలబడ్డ గుల్జారీలాల్‌నందా,



*"మా అమ్మ కృష్ణవేణమ్మ , నాన్న క్రృష్ణ మూర్తి" నాన్న 'షష్టిపూర్తి' సందర్భంగా తీసుకున్న తీపి జ్ఞాపకం ఈ ఫోటో*

*అమ్మా వాళ్ళది పాత శ్రీకాకూళం జిల్లా పార్వతీపురం ఇప్పుడు విజయనగరం జిల్లా నాన్నా వాళ్ళ ది రాజం.*

*నాన్న అప్పటి మెద్రాస్ (చెన్నై) లో ఫార్మాసిష్టుగా ఉద్యోగం చేసేవారు వారి వివాహం తర్వాత పిఠాపురం కిర్లంపూడి షుగర్ మిల్స్ డిస్పెన్సెరీ ఇంచార్జి గా పిఠాపురం షుగర్ ఫ్యాక్టరీ హాస్పిటల్‌లో ఉండేవారు .*

*అమ్మా నాన్న ఫోటో ఫేస్‌బుక్‌లో పెట్టాలని నాకు ఎప్పటినుండో కోరిక ఇంతకాలానికి వీలు పడింది ఇలా మీ అందరితో నా భావావేశాన్ని పంచుకునే అవకాశం దొరికింది !* **- బాంబు**

జీవితాన్ని ప్రజాసేవకే అంకితం చేసి రెండు జతల బట్టలు, గుడ్డసంచి, నీళ్ళసీసా ఆస్తితోనే జీవించిన గాంధీయోద్యమకారులు వావిలాల గోపాలకృష్ణయ్యలను స్ఫూర్తిగా తీసుకున్న ఎమ్.ఎస్.ఎన్.శాస్త్రి....బాంబు సాంఘికంగా ఎంత పేరు సంపాదించినా ఆర్థికంగా ఎన్నో ఇబ్బందులనెదుర్కొన్నాడు. పిల్లలందరికీ బొటాబొటి చదువులు, చిన్నా చితకా

*మనిషికి సంపాదన కంటే సంస్కారం ముఖ్యమనే భావన అంత బలంగా నాన్నకి ఎలా కలిగిందో అని ఆశ్చర్యం వేస్తుంటుంది.*

*డబ్బు కోసం ఎంతకైనా దిగజారే వ్యక్తిత్వాల్ని చూసినప్పుడు సెంటు భూమి, అకౌంట్లో పది రూపాయలు లేవని ధైర్యంగా నిలబడి చెప్పగలిగిన స్థైర్యం ఆయనకి జీవితాంతం ఎలా నిలిచిందో అని దిగ్భ్రాంతి కలుగుతుంది. ఆయనేం పురుషోత్తముడు కాదు, అయినా మనిషన్నాక తప్పొప్పుల మిళితం. ఆ రకంగా ఆయన చేసిన పొరపాట్లు, పడ్డ తడబాట్లు చాలానే ఉండవచ్చు. కానీ ఒక్క రూపాయి కోసం ఎన్నడూ కక్కుర్తి పడని ఆ స్వభావం నా దృష్టిలో ఒక తిరుగులేని ఆదర్శం. అదెంత మహోన్నతమైందో, ఈ రోజు నాకు ఇంకా బాగా అర్థం అవుతోంది. అదంత సులువు కాదు. అసలు సులువే కాదు. సంపాదించకుంటే పోయె, సంపాదనకు వ్యతిరేకంగా ప్రత్యేకంగా ప్రచారం చేస్తూ I am Against to the Habitual Earning అంటూ స్థితప్రజ్ఞతకి ప్రతిరూపంగా జీవించిన నాకు తెలిసిన మొదటి, చివరి వ్యక్తి ఎవరు నమ్మినా లేకున్నా ఎప్పటికీ గర్వంగా చెప్పగలను. నాన్న ఒక్కడే!! I am Proud to be his Son.*

*ఆస్తులకు అంతస్తులకు తప్పనిసరి వారసుల్ని తయారుచేసుకోవడమే తెలిసిన వ్యవస్థకి విలువల్ని వారసత్వంగా అందించేవారు వింతగా కనబడటం ఆశ్చర్యం లేదు. అందుకే అసత్యానికీ, అవినీతికి వత్తాసు పలకనందుకు ఆయన పై అభాండాలు వేసిన అక్రమార్కులు ఆయన చావును కూడా సొమ్ము చేసుకోవడం మొదలెట్టారు. We never mind. అలవాటైన దిగజారుడుతనం ఉత్తమంగా కనిపిస్తే, అమ్ముడుపోయిన వ్యక్తిత్వం అహంకారం ప్రదర్శిస్తుంది. ఆ రెంటినీ కలగలుపుకున్న వాళ్ళకు పక్క వాళ్ళ మీద పడేడవడం తప్పా వేరే పనేమీ ఉండదు. ఆయన జీవితం మీదే పడేడ్చే వాళ్ళంతా ఇదే బాపతు. వాళ్ళాయన ఎత్తును అందుకోవడం మాటటుంచి ఆయన పాటించిన విలువల దరిదాపుల్లోకి కూడా రాలేరు. ఎందుకంటే ఆయన తన అస్తిత్వాన్ని సంపాదనలో కాకుండా విలువల్లో కొలుచుకున్నారు. వారసత్వాన్ని మానవత్వంలో మాకందించారు. మానవత్వాన్ని మించిన వారసత్వం లోకంలో మరేదీ లేదు!*

–గౌరవ్



నేనురాధ,రాజుసీత, శ్రీనుశారద

మా 'రాజుగాడు' పిఠాపురం R.R.Bh.R హైస్కూలు లో 8వ తరగతి చదువుకునేటప్పటినుంచి మేం ముగ్గురం స్నేహితులం!

పెళ్ళిళ్ళు జరిగి జీవిత భాగస్వాములు మా జీవితాల్లోకి వచ్చినా మాస్నేహబంధం అలాగే కొనసాగుతొంది !

నిన్న ఉదయం గోపి ఫోను చేసి అన్నయ్య కు ఆరోగ్యం బాగాలేదని తల కు ఆపరేషన్ జరిగిందని చెప్పడంతొ..... నిన్న సాయంత్రం కాకినాడ ట్రస్ట్ హాస్పిటల్ కు వెళ్ళి మా రాజు గాడిని చూసి వచ్చా

విధి ఎంత చిత్రమైనది? రాజు బయట తిరిగేది తక్కువ బయటకు వచ్చినా..... కార్లో వచ్చి ఇంటికి వెళ్ళిపోడమే, కరొనా వచ్చిన తర్వాతా భౌతిక కలయికలు తగ్గిపోయాయి ముగ్గురం ఫోనులో మాటలే

వాళ్ళిద్దరూ ఎప్పుడూ కార్ల లో తిరుగుతూ ఉంటారు వాళ్ళకు 'రిస్క్' తక్కువ నేనే బయట ఎక్కువ గా తిరుగుతా బండి మీద నాకు రిస్క్ ఎక్కువని నేను భావించేవాడిని

ఆ మధ్య 'శీను శారద' కోవిడ్ బారిన పడి హాస్పిటల్ లో చేరి బయట పడ్డారు ఇప్పుడు రాజు గాడు తొందరగా కోలుకుని మా స్నేహబంధం ఇలాగే కొనసాగాలని మనస్పూర్తిగా కోరుకుంటూ....

**బాంబు**

పనులే కాని పెద్ద స్థాయిగల ఉద్యోగాలు రావాలని ఆయనెప్పుడూ అనుకోలేదు. వీలైనంత నిజాయితీగా, అందరితో మంచిగా బతకమని చెప్పే ఆయన అలుపెరుగని ఆశయ సంపన్నుడు. **- విప్లవ్**

## శిఖరమెదురొచ్చినా శిరస్సువంచని స్థితప్రజ్ఞుడి ప్రస్తానం ఎక్కడికి?

"రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యాన్ని గడగడలాడించిన గాంధీ, నెహ్రూ, పటేల్‌లకు వారసులమేనా మనం? సుభాష్ చంద్రబోస్, భగత్‌సింగ్, అల్లూరివంటి పోరాటయోధుల రక్తం మనలో యింకా ప్రవహిస్తోందా? గానుగెద్దు జీవితాలతో, జానాబెత్తెడు ఆశయాలతో, నిర్లజ్జగా–నిస్సిగ్గుగా బతికేయడం ఈ జాతికి పట్టిన జాడ్యం. కనీసం యువతరమయినా కంప్యూటర్ పద్మవ్యూహంలోంచి బయటపడి నిజాలు ఆలోచించాలని, నిజంగా బతకాలని, మన స్వాతంత్ర్య ప్రదాతల నిజమైన వారసత్వాన్ని నిరూపించుకోవాలనీ, యువతరాన్ని ఉత్తేజపరచడానికి, కార్యోన్ముఖులను చేయడానికీ, జాతి గర్వించదగ్గ శక్తిగా ఆలోచించాలనీ, ఆచరించాలనీ, అవతరించాలనీ, మోడీలాంటి కెడిగాళ్ళకు సమాధానం చెప్పే సత్తా మన యువతరానికి రావాలని ఆశిస్తూ...ఆకాంక్షిస్తూ ఈ ఉద్యమం. అందుకే ఈ నిరాహార దీక్ష

*ఇన్నేళ్ళ నుంచి పిఠాపురంలో ఉంటున్నా. నాకు తెలిసీ మాటల్లో చెప్పిందే చేతల్లో చూపించే అరుదైన వ్యక్తి సత్యనారాయణశాస్త్రిగారు.*

*కీ.శే. ఆవంత్స సోమసుందర్ గారి తర్వాత మన పిఠాపురంలో నాకు తెలిసీ మరణాంతరం పార్థివ దేహాన్ని వైద్య విద్య కోసం దానం చేసిన రెండో వ్యక్తి ఆయనే. సో.సు. దేహాన్ని రంగరాయ మెడికల్ కాలేజ్‌కి ఇచ్చారు. సత్యనారాయణ శాస్త్రిగారిది రాజమహేంద్రవరం జియస్సెల్‌కి ఇవ్వడం జరిగింది. అలా పిఠాపురంలో అవయవదానానికి సంబంధించిన చైతన్యానికి అంకురార్పణ జరిగిందనే నా అభిప్రాయం.*

***– కొండేపూడి శంకర్రావు,***

*సూర్యరాయ విద్యానంద గ్రంథాలయ కార్యదర్శి*

ప్రారంభిస్తున్నా." కే.జి.బేసిన్ గ్యాస్‌ను జాతీయం చేయాలంటూ బాంబు చేసిన నిరాహార దీక్షలో ఈరోజు దేశ ప్రధానమయిన మోడిని తూలనాడుతూ రాసిన కరపత్రంలోని వాక్యాలివి. నక్సలైటోద్యమ నాయకుడు ఆదిభట్ల కైలాసాన్ని బాల్యంలోనే చూసిన ప్రభావమో, ఎ.వి.కె.చైతన్య, కె.ఎస్.తిలక్‌ల సాన్నిహిత్యమో తెలీదుకానీ, ఉద్యమకారుడిగా బాంబు సాధించిన విజయాలూ అపజయాలూ చాలానే ఉన్నాయి.

– రాష్ట్రంలో లిక్కర్ బాటిళ్ళపై ధరను ముద్రించీ వినియోగదారులు మోసపోకుండా కాపాడాలని ప్రజా ప్రయోజన వ్యాజ్యం వేసి విజయం సాధించడం జరిగింది. ఈరోజు మందుబాబులు కనీసం ఎమ్ఆర్‌పి ధరకు మద్యం పొందగలుగుతున్నారంటే అదే కారణం.

– బాలయోగి మొదలుకుని, పిఠాపురం వద్ద గోర్స గ్రామంలో వెలిసిన దొంగబాబా వంటి భక్తి పేరుతో ప్రజలను మోసం చేస్తున్న ఎంతో మంది బాబాల ఆటకట్టించిన చరిత్రుంది.

– జిల్లాలో కత్తి పద్మారావు, రావిపూడి వెంకటాద్రి, వెనిగళ్ళ

*"చాలా కాలం దశరథరామ్ సహచరుడుగా వున్న వ్యక్తి 'బాంబు' ఆలియాస్ యం.యస్.యన్.శాస్త్రి 1983లో దశరథరామ్ నుండి విడివడి ఏకంగా 'ఎన్‌కౌంటర్ దశరథరామ్ బండారం' అనే పుస్తకం రాశారు. ఎన్‌కౌంటర్‌ని తలదన్నే అసభ్యశైలీ ఆ పుస్తకంలో ఉంది. రాజమండ్రి దాడి సంగతి, ఫొటో సంగతి అందులో ఉన్నాయి. దశరథరామ్ ఆ పుస్తకం ప్రింటు కాకముందే కోర్టుకి వెళ్ళి ఇంజక్షన్ తెచ్చుకున్నాడు. నెం.38/25.9.1983 ఎన్‌కౌంటర్ సంచికలో ఈ సంగతి వివరిస్తూ వ్యాసం రాశాడు. (ఇటీవల 'బాంబు' విజయవిహారాన్ని కలిసినపుడు – దశరథ్‌రామ్ వ్యక్తిగతంగా నిప్పులాంటి వాడేనని, కేవలం అతని చట్టూ ఉన్న 'కోటరి' పట్ల ఆగ్రహంతోనే తానా పుస్తకం రాశానని, తరువాత కాలంలో తామిద్దరం రాజీపడి, మళ్ళీ స్నేహితులమయ్యామని అన్నారు).*

**–రమణమూర్తి,** 'ఎన్‌కౌంటర్ దశరథరామ్‌ను తలచుకుందాం' రచన నుంచి...

సుబ్బారావులతో సభలను ఆర్గనైజ్ చేయడం జరిగింది.

– దూబగుంట కేంద్రంగా జరిగిన మద్యపాన వ్యతిరేకోద్యమం స్ఫూర్తితో పిఠాపురంలో సారా వ్యతిరేకోద్యమాన్ని బాంబు నడపడం జరిగింది.

– మతి స్థిమితం లేని వార్ని వేరే ప్రాంతాలకు పంపించడం, వారిపట్ల ప్రభుత్వ బాధ్యతను గుర్తు చేయడం చేసేవారు.

– కూల్‌డ్రింకులూ, కార్పోరేట్ ఆహార పదార్థాలు, ప్రమాదకర పరిశ్రమలకు వ్యతిరేకంగా పనిచేసారు.

– ఎన్‌కౌంటర్ దశరథరామ్ బండారం, బాలయోగి బండారం మొదలైన పుస్తకాలతో పాటు అనేక కరపత్రాలూ, పత్రికా వ్యాసాలు, ఉద్యమ లేఖలూ రాశారు.

– దళిత బహుజనులు, బడుగు జీవులపై జరిగే అన్యాయాలను నిగ్గదీయడం, వారికి అండగా నుండటం జరిగింది.

– బాలయోగి మొదలుకొని గోపాల్ బాబా దాకా అతీత శక్తులున్నాయనీ, మహిమలున్నాయనీ ప్రచారం చేసుకున్న అనేకమందిని ప్రజాపక్షాన ప్రశ్నించి ఎన్నో దాడుల్నీ, కేసుల్నీ ఎదుర్కొని కూడా ఎన్నడూ వెనుదిరగలేదు.

### ‘బాంబు’ అనే పేరెలా వచ్చింది? :

*సత్యనారాయణ శాస్త్రిని ఇంట్లో బాబు అని ముద్దుగా పిలిచేవారు. పక్కింట్లో ఉన్న పిల్లాడి పేరు కూడా బాబే. ఇద్దర్నీ బాబు అని పిలవడం బాగాలేదని వోరోజు పక్కింటావిడ శాస్త్రిని ఇకనుంచి నువ్వు బాబువి కాదు, బాంబువంది. ఆ పేరే స్థిరపడింది. తర్వాత కాలంలో అన్యాయాన్నెదిరిస్తూ ఎక్కడ అక్రమం జరిగినా ప్రశ్నిస్తూ శాస్త్రి చేసిన పనులు సంచలనాత్మకమై క్రమంగా పెట్టుడు పేరే అసలైపోయి అసలు పేరు మరుగున పడింది. చాలామందికి ఆయన తమ పక్షం వహించే బాంబుగారే కాని శాస్త్రికాదు. ఇప్పటికీ సత్యనారాయణ శాస్త్రంటే ఎవరికీ తెలీదు, “బాంబు” అంటేనే తప్ప.*

– సంప్రదాయ కవి, విశ్వనాథ సత్యనారాయణను, దశరథరాం ఉతికారేసినట్లే కమ్యూనిస్టు కవి ఆవంత్స సోమసుందర్‌ను ఆరోజుల్లో 'బాంబు' మొహం మీదే కడిగి పారేశారు.

– చాలా కాలం కిందే అంటే 80 ప్రాంతంలోనే ప్రెస్ కౌన్సిల్‌కి 'సాక్షి' పేరుతో పత్రిక పెట్టదలచి బాంబు దరఖాస్తు చేసుకున్నట్లు ఆధారాలున్నాయి

– ఇంకా అనేక ప్రజాసంఘాల్తో వివిధ ప్రజాసమస్యలపైన పని చేసినట్లు తెలుస్తోంది.

ఐతే, అహంకారం, పురుషాధిపత్యం, ఆడంబరత్వం ఎంతో కొంత ప్రభావం చూపిన ఈ ఫ్యూడల్ బ్రాహ్మణీయ లక్షణాలన్నీ దశరథరామ్ నాటి తరాల్ని కొద్దోగొప్పో లొంగదీసుకున్నాయి. కాన వాటి తాలూకు ఛాయల నుండి బాంబు కూడా మినహాయింపేం కాదుగానీ అంతిమంగా ఈ అవలక్షణాలన్నింటినీ విడనాడటానికి చేసే యత్నాల సాధనలోనే ఒక వ్యక్తి ఔన్నత్యం ఇమిడి ఉన్నదనుకుంటే బాంబును అసామాన్యుడిగా

*నాకప్పుడు ఇరవై రెండేళ్ళు ఉంటాయి. బాంబు గారు పిఠాపురం ఓపెన్ ఎయిర్ థియేటర్‌లో నిర్వహించిన హేతువాద సభలకు చూద్దామని వెళితే ఏకంగా ఇసుక రాలనంత జనసందోహం. అస్సలు ఖాళీ లేదు. ఆ రోజు సభలకు ఎన్‌కౌంటర్ పత్రిక డేరింగ్ & డాషింగ్ ఎడిటర్ పింగళి దశరథరామ్ ప్రత్యేక ఆకర్షణ. ఆయనే కాకుండా ఒక పెద్దాయన స్వాతంత్ర్య సమరయోధుడు కూడా వచ్చారు. చివరాఖరికి ఆ సభాస్థలి వెనుక వైపు ఉన్న గేట్లు దూకి మా మిత్రబృందం ఆ సభలకి వెళ్ళడం జరిగింది. నా ఆలోచనా రీతిని కాస్తో కూస్తో హేతుబద్ధంగా మల్చుకోవడానికి ఆ సభలు ఎంతగానో ఉపయోగపడ్డాయ్. నాకసలు ఆయన చనిపోయే వరకూ సత్యనారాయణ అనే పేరు తెలియదు. ఆయన మాకెప్పటికీ 'బాంబు'గారే!*

***– మహ్మద్ భాషా, న్యూఢిల్లీ***

అభివర్ణించుకోవచ్చునేమో. ఐతే, మొత్తంగా చూసినప్పుడు భావోద్యమకారుడిగా సాంఘిక ఉద్యమకారునిగా వెలిగిన బాంబు తిరిగి శాస్త్రిగా మారి సాంప్రదాయ హైందవ మత సంస్కృతిలో భాగమయిన పూజలూ, పురష్కారాల బారిన పడటం కుల సంఘమైన బ్రాహ్మణ సంఘంలో భాగమవడం, వ్యవస్థకి అనారోగ్యకరమైన విషయమైనప్పటికీ, ఎప్పటికీ ప్రజాపక్షం వహించే ఆ స్ఫూర్తిని ఆయన్నుంచి గ్రహించడంలో తప్పు లేదనుకుంటూనే ఈ స్థితప్రజ్ఞుడు తన ప్రస్థానాన్ని పున: పరిశీలించుకోవాలని సూచిస్తున్నాం. **–వివేక్**

## అలవికాని ఆదరణకు ప్రతిరూపం అనూరాధ



ఎప్పుడో ఉత్తరాంధ్ర వొదిలి దండకారణ్య ప్రాంత మయిన మధ్య భారతదేశానికి వలసపోయిన కుటుంబం. తండ్రి చిట్టెళ్ళ నరసింహమూర్తి, తల్లి లక్ష్మీవిలాసం, ఆయన మొదటి భార్య రమణమ్మకు సంతానం కలుగక రెండో పెళ్ళి చేసుకోగా ఐదుగురు సంతానం. ఇద్దరు కుమారులు, ముగ్గురు కుమార్తెలు కలిగేరు. వారిలో

*చిన్నప్పుడు ఆయనంటే భయం ఉండేది. కానీ ఇంటికి వచ్చినప్పుడుగానీ బయట కలిసినప్పుడు కానీ ఆయన చూపించిన ప్రేమ మరువలేనిది. మా స్నేహితుడి తండ్రిగా ఆయన ఏ విషయంలో అయినా మాకు అండగా ఉండేవారు*

***– బండే సుధాకర్ & గౌరవ్ మిత్ర బృందం***




రెండోది రాధ 20-12-65న రాయ్‌పూర్‌లో జన్మించింది. ఇంటర్‌మీడియేట్‌తో చదువు ముగి సింది. తండ్రి చేసిన పౌరోహిత్యం ద్వారానే ఇల్లు గడిచేది. చాలీచాలని సంపాదన. అలా ఒక సందర్భంలో కుటుంబ సమేతంగా పుణ్యక్షేత్రాల సందర్శనకు ఆంధ్ర దేశంలోని గోదావరి ప్రాంతం అప్పనపల్లి వచ్చినప్పుడు మార్గమధ్యలో పిఠాపురంలో పైలరాజులుగారు రాధ తండ్రిగారికి మిత్రులవడం చేత వారింటికి వెళ్ళినప్పుడు రైల్వేస్టేషన్‌లో మొట్టమొదటిసారిగా కులాసాగా సిగరెట్టు కాలుస్తూన్న మేకా సత్యనారాయణశాస్త్రి (బాంబు)ని చూడ్డం జరిగింది. ఆ పరిచయం పెద్దల ప్రమేయంతో పెళ్ళికి దారితీసింది. అప్పుడు రావడం మొదలు, మళ్ళీ ఆయనతో తప్ప పుట్టింటికెళ్ళింది లేదు, మెట్టింటిని వదిలిందీ లేదు. మూడు పురుళ్ళూ పుట్టింట్లోనే పోసుకున్నప్పటికీ అక్కడెక్కువ కాలం ఉన్నది లేదు.

ఈ దేశంలో భార్యను జూదంలో పెట్టినవాడు ఐతిహాసికుడు, బజార్లో అమ్మేసినవాడు సత్యసంధుడు, అనుమానంతో అడవులపాలు చేసినవాడు దేవుడు, నిద్రపోతున్న భార్యను నిర్దాక్షిణ్యంగా వొదిలిపోయినవాడు బుద్ధుడు.

మామూలు మనుషుల్నుంచి మహాత్ములదాకా ఈరోజుకీ స్త్రీ స్వేచ్ఛను అర్థం చేసుకోవడంలో పురుష సంతతంతా వెనకబడే ఉందనేది నిజం. అందుకే "ఏ సమాజం లోనయినా సరే సనాతన సంస్కృతీ సంప్రదాయాలను కాపాడ్డం అనేదానికి అర్థం స్త్రీల నడవడికనూ అలవాట్లనూ కఠినంగా నియంత్రించడమే" నంటాడు బాలగోపాల్. అలాంటి వ్యవస్థలో బ్రాహ్మణీయ పురుషాధిపత్య భావ నలు పహారా కాస్తున్న ఇంట్లోకి ప్రవేశించిన స్త్రీ పరిస్థితి ఎలా వుంటుంది? దేశంలోని మధ్య తరగతి కుటుంబాల్లోని స్త్రీలలాగానే అధ్వాన్నంగా వుంటుంది. గయ్యాళి కాదుగానీ అత్తగారితనం పేరిట పెత్తనం చెలాయించే అత్తను, ఆమె మాటను ఎన్నడూ జవదాటని మామ, ఎప్పుడూ ఇంటి పట్టు నుండకుండా ఏవో పనులంటూ బయట తిరిగే భర్తా, ఇలాంటి మనుషుల మధ్య ఉన్న ఒక్కగానొక్క ఆడబడుచే కాస్త వోదార్పునిచ్చేది. భాగ్యలక్ష్మే మననుకు సాంత్వన చేకూర్చేది.



సారా వ్యతిరేక ఉద్యమాన్ని
ప్రోత్సహించండి.

మన కుటుంబాలను గుల్లచేస్తూ, కాపురాలను కూల్చివేస్తూ, సామాన్య ప్రజల బ్రతుకులను కన్నీటి మడుగులుగా మారుస్తూ మన మహిళల పాలిట మహమ్మారిగా అంకురించి మన మగవాళ్ళను బలి పశువులుగాచేస్తూ తల్లికీ, పిల్లకీ, తేడా తెలియని అయోమయ పరిస్థితులను కలిగించుచూ లక్షలాది కుటుంబాలను సర్వనాశనము చేస్తున్న ఈ మహమ్మారి సారాను సమూలంగా నిర్మూలించుటకు యావన్మంది "స్త్రీలు" రేపు అనగా ది 24—9—92 గురువారం మధ్యాహ్నం 2—00 గంటలకు పిఠాపురం RTC కాంప్లెక్సునుండి బయలుదేరి MRO ఆఫీసు వద్దకు ఊరేగింపుగా వెళ్ళి MRO గార్కి "మెమోరాండం" సమర్పించి మన నిరసని తెలియజేయుటకు యావన్మంది ప్రజానీకము, వివిధ సంఘ సభ్యులు మరియు వివిధ రాజకీయపార్టీల వారు, మహిళా సంఘాలవారు ఈ కార్యక్రమములో పాల్గొని జయప్రదము చేయవలెనని కోరి ప్రార్థించుచున్నాము.

ఇట్లు,
"స్త్రీ శక్తి విభాగం"
అభ్యుదయ ప్రజావేదిక
కన్వీనరు
శ్రీమతి అనూరాధాశాస్త్రి
పిఠాపురం. ఫోన్ 757

పిఠాపురం,
3—9—92

ఏదేమయినా ఒక్కసారి పట్టుకున్న భర్త చేతిని వదలాలని ఎన్నడూ ఆమె అనుకోలేదు. అందుకోసం ఆమెకి దక్కిందేంటంటే అవమానాలు, ఛీత్కారాలు,



వేధింపులు, సాధింపులు. కుటుంబంలోని ఆడవాళ్ళ మీద వయసుతో నిమిత్తం లేకుండా అధికారం చెలాయించే హక్కు పుట్టిన పిల్లాడు మొదలుకుని ప్రతి మొగాడూ తనకున్నదను కుంటాడు. అందుకే ఈ దేశంలో సంసారం సజా వుగా సాగాలంటే మొట్ట మొదటి తాకట్టు పెట్టాల్సింది స్త్రీ తన ఆత్మగౌరవాన్నీ, ఆత్మాభిమానాన్నే. ఆడవా ళ్ళంటే వంటపనులు, వంటిపనులే కాని ఇంకేం తెలీదనే అజ్ఞానం నిండిన వాతావరణానికి అప్రయత్నంగానే స్త్రీల సృజనాత్మకత ఆవిరైపోతుంది. ఇంటర్లో 'హోమ్ సైన్సు' చేసినపుడు జాగ్రత్తగా తాను తయారుచేసుకున్న రెండు ప్రాజెక్ట్ ఫైళ్ళను అప్పుడప్పుడూ అపురూపంగా ఆమె చూసుకుంటున్నప్పుడు ఆ కళ్ళలోని అసహాయతని, ఆర్ద్రతనీ అర్థం చేసుకొనే ప్రయత్నం చేసినవాళ్ళు తప్పితే, సొంత జీవితాన్ని కోల్పోయిన ఎంతో మంది అమ్మల వేదన మామూలుగా చాలామందికి అసలర్థమే కాదు.

"చేతకంటే హెచ్చు వ్రాత లేదన్నా"డు వేమన. అనూరాధది అదే కథ. ఒకవైపు కుటుంబ బాధ్యతలు నిర్వర్తిస్తూనే మరోవైపు ఉద్యోగయత్నాలు చేయడం జరిగింది. కాని, అదెంతో కాలం సాగలేదు. కొన్నాళ్ళు హిందీ టీచరుగా చేసారు. తర్వాత పిఠాపురంలో మొట్టమొదటి విజయాడైరీ పాలు పాల పదార్థాల్నీ అమ్మే అనుబంధ దుకాణం ఇంట్లోనే తెరిచారు. ఖచ్చితమైన

ఆదాయం, స్థిరత్వంలేని భర్తా, ముగ్గురు పిల్లల్నీ అత్తమామలూ, అప్పుడప్పుడూ వచ్చే బంధుమిత్ర పరివారాన్ని అంతకాలం ఆమె ఎట్లా నెట్టుకురాగలిగారో తల్చుకుంటే ఆశ్చర్యం వేయక మానదు. ఇది చాలదన్నట్లు ఆయన చేసే ఉద్యమాల్లో పాలుపంచుకోక తప్పని పరిస్థితి. అలా 'బాంబు' చేసిన ఉద్యమాల్లో అన్నింట్లోనూ ఎంతో కొంత ఆమె ప్రమేయమున్నప్పటికీ 1992లో ఉధృతంగా అభ్యుదయ ప్రజావేదిక ఆధ్వర్యంలో, స్త్రీ శక్తి విభాగం సారధ్యంలో అన్ని ప్రజాసంఘాలు, రాజకీయ పార్టీల్ని కూడగట్టి చేసిన మద్యపాన వ్యతిరేకోద్యమానికి నిర్వాహకురాలుగా, నాయకురాలిగా ఉండటం చిరస్మరణీయ అనుభూతంటారామె. ఏవో అల్పమైన అసంతృప్తులే కాని అల్ప సంతోషైన ఆమెకు పెద్దగా ఆశలేం లేవుగాని ఆత్మీయతతో కూడిన ఆమె వ్యక్తిత్వం, ఎన్ని ఒడిదుడుకులనైనా ఓర్చుకునే తత్వం సమకాలీనులనేకులకు ఆశ్చర్యకర అంశమే.

–అమర్



*బంటీ...సుమారు మా ఇంటికొచ్చి ఇరవై ఏళ్ళు అవుతోంది. మా కుటుంబంలో ఎంతగా కల్సి పోయిందంటే బాంబు ఇంట్లో ఎక్కడ ఉంటే, అక్కడే అదుండేది. శాస్త్రి చనిపోయిన రోజు నుండి పూర్తిగా డల్ ఐపోయింది. బాంబుతో దీని అనుబంధాన్ని చూసి ఆయన హచ్ డాగ్ అని పిలిచేవాళ్ళు. ఆయన ప్రేమగా బంగారం అని ముద్దుగా పిలిస్తే ఎక్కడున్నా ఆయన దగ్గరకి పరిగెత్తుకుంటూ వచ్చేసి గారాలు పోయేది. ఇంట్లో ఎప్పటి నుండో కుక్కలని పెంచుకునే అలవాటు ఉన్నప్పటికీ ఇన్ని సంవత్సరాలు ఉన్న కుక్క బంటీ మాత్రమే. పైల రాజులు గారి ఇంటి నుండి నెల కూడా నిండని ఈ బంటీని తెచ్చాం.*

## ఆలిండియా బ్రాహ్మణ ఫెడరేషన్ కార్యదర్శిగా శాస్త్రి

పిఠాపురం: ఆలిండియా బ్రాహ్మణ ఫెడరేషన్ జాతీయ కార్యదర్శిగా పిఠాపురానికి చెందిన ఎంఎస్ఎన్ శాస్త్రి నియమితులయ్యారు. ఇటీవల నూతనంగా ఎన్నుకున్న కార్యవర్గంలో ఈయనకు స్థానం లభించిందని సోమవారం ఒక ప్రకటనలో పేర్కొన్నారు. బ్రాహ్మణ సేవల్లో ముందుంటూ, వారి సమస్యల పరిష్కారానికి కృషి చేస్తానన్నారు.



AIBF ఆలిండియా బ్రహ్మణఫెడరేషన్ ఉత్తరప్రదేశ్ లో ని శుక్రతల్లో నన్ను "విప్రశ్రీ గౌరవసన్మన్" బిరుదునిచ్చి సన్మానిస్తున్న అధ్యక్షులు MLA శ్రీ పండిత్ భవర్ లాల్ శర్మ,సెక్రటరీ జనరల్ ప్రదీప్ జ్యోతి, ఉత్తరప్రదేశ్ బ్రహ్మణ సభ అధ్యక్షులు శ్రీ పదంప్రకాష్ శర్మ మోదలైన పెద్దల సమక్షంల సత్కరిస్తూ........ బాంబు

## ఏఐబీఎఫ్ జాతీయ కార్యదర్శిగా శాస్త్రి

పిఠాపురం, జనవరి 3: ఆల్ ఇండియా బ్రాహ్మణ ఫెడరేషన్ (ఏఐబీఎఫ్) జాతీయ కార్యదర్శిగా పిఠాపురానికి చెందిన ఎమ్ఎస్ఎన్ శాస్త్రి(బాంబు) నియమితులయ్యారు. ఆయన గతంలో ఫెడరేషన్‌లో కీలకంగా వ్యవహరించారు. బ్రాహ్మణ సంక్షేమానికి అందించిన సేవలకు గానూ రెండేళ్లక్రితం శాస్త్రిని ఏఐబీఎఫ్ విప్రశ్రీ గౌరవ సమ్మాన్, ఉత్తరాఖండ్ బ్రాహ్మణ సంఘం విప్రశ్రీతో సత్కరించారు. జాతీయ కార్యదర్శిగా నియమించిన జాతీయ అధ్యక్షుడు, కార్యవర్గ ప్రతినిధులకు శాస్త్రి కృతజ్ఞతలు తెలిపారు. శాస్త్రిని పలువురు అభినందించారు.



# దు:ఖానికి ధృవపత్రం ఉండదు!

–గౌరవ్

'బాంబు' పేరిట ప్రసిద్ధి చెంది, ఒక తరానికి సంచలన జర్నలిస్టుగా తెలిసిన మేకా సత్యనారాయణ శాస్త్రి ఎన్‌కౌంటర్ పత్రికని పింగళి దశరథరామ్‌తో కలిసి నడిపాడు. ఒకనాటి నాస్తిక, హేతువాద, కమ్యూనిస్టు, సోషలిస్టు, కాంగ్రెస్ తర్వాత టిడిపి వారితో కల్సి నడిచారు.

ఒక దశలో దశరథరామ్‌తో విభేదించి "ఎన్‌కౌంటర్ దశరథరామ్ బండారం" పేరిట పుస్తకం కూడా రాసారు. తరువాత కాలంలో మళ్ళీ ఇద్దరూ స్నేహితులయ్యారు. కానీ దశరథరామ్ హత్యతో ఈయన చాలా క్షోభకి గురయ్యారు. క్రియాశీలంగా కొంతకాలం స్తబ్దతకి లోనయ్యారు.

తదనంతరం ఆధ్యాత్మికతలోకి వెళ్ళినా సామాజికంగా ఎక్కడా రాజీ పడలేదు. పర్యావరణ పరిరక్షణ సామాజిక అసమానతలు, మానవ హక్కుల కోసం జీవితాంతం పోరాటం చేశారు. మూడుసార్లు ఆమరణ నిరాహారదీక్షలు చేసి ప్రజా సమస్యలపై పోరాడారు. హైకోర్టులో వేసిన పిల్స్‌కైతే లెక్కే లేదు.

ఫ్రీలాన్స్ జర్నలిస్ట్‌గా జీవితాంతం కొనసాగిన ఆయన అభిప్రాయాల పట్ల ఎన్ని విభేధాలు ఉన్నా నిజాయితీ, నిబద్ధతకి శత్రువులు సైతం

సంస్మరణ సమావేశం

సర్వజన హితమే అతని మతం !
సర్వ మానవ వికాసమే ఆయన అభిమతం !!

సత్యనారాయణ శాస్త్రి (బాంబు)
సీనియర్ జర్నలిస్టు, సోషల్ ఏక్టివిస్టు

మార్చి, 10 గురువారం, 2022
చెలికాని భావనరావు సభాసదన్, సూర్యరాయ విద్యానంద గ్రంథాలయం, పిఠాపురం.

జననం : 04-12-1955
మరణం : 28-02- 2022

అబ్బురపడిన సంఘటనలు చాలానే ఉన్నాయి. అనేక చిన్న పత్రికలకు అప్రకటిత వ్యవస్థాపకుడు.

రెండు కోవిడ్ వేవ్‌లనూ ధైర్యంగా దాటేసిన ఆయన ఫిబ్రవరి 28, నేషనల్ సైన్స్‌డే నాడు తెల్లవారుజామున నిద్రలోనే మరణించారు. గతంలో రెండుసార్లు గుండెపోటు వచ్చింది. ఇది మూడవ సారి మైల్డ్‌స్ట్రోక్ కావచ్చు.

పదిరోజుల క్రితం అకస్మాత్తుగా చనిపోయిన నాన్న బావాలతోనే కానీ ఆయనతో ఉన్న బంధంతో నాకేమీ సంఘర్షణ లేదు. ఆయన నా అస్తిత్వానికి కారకుడు. నా ఆవిర్భావానికి ఆద్యుడు.

ఆయన కళ్ళను ఇద్దరు అంధులకీ, దేహాన్ని భావి వైద్య విద్యార్థుల కోసం ఆస్పత్రికి ఇవ్వడం జరిగింది. అలాంటి క్లిష్ట సమయంలో సైతం నాకు కుటుంబ సభ్యులు, మిత్రులు, శ్రేయోభిలాషులు అందరూ ఎంతో అండగా నిలిచారు.

రాష్ట్ర వ్యాప్తంగా సుదూర ప్రాంతాల నుండి స్వచ్ఛందంగా స్పందించి నాకు ధైర్యాన్ని ఇచ్చిన వారికి కృతజ్ఞతలు. అకస్మాత్తుగా అన్నీ గందరగోళంగా కనబడుతున్న నాకు ఇప్పుడిప్పుడే బాధ నుంచి తేరుకోగలిగే చేవ వస్తోంది.

ఎన్నో మిశ్రమ భావాల ఆయన తత్వంతో నాకు పూర్తి అంగీకారం లేకపోయినా, మానవత్వంతో కూడిన ఆయన మమతానురాగాల ముందు నమ్రతతో మనస్ఫూర్తిగా తలొంచి నా నివాళులు అర్పిస్తున్నాను.

సంస్మరణ సమావేశం కూడా మొన్న పూర్తి అయ్యింది. ఆ సందర్భంగా నేనూ, నా సహచరి కూడా మా నేత్ర దేహదానాల్ని చేస్తున్నట్లు సభాసాక్షిగా ప్రకటించాం. ఈ బాధ నుండి నాకు కోలుకోడానికి కొంత సమయం అవసరం.

కాన, సామాజిక మాధ్యమాలకి కొన్నాళ్ళు దూరంగా ఉండడానికి నిర్ణయించుకున్నాను. ఇతరేతర కార్యాచరణ కార్యక్రమాలు ఎలాగూ ఉంటాయ్ కానీ కూడదీసుకుందుకు కొంత కాలం పడుతుంది. సెలవు.

## మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) స్మృతి చిహ్నంగా ఏడాది కాలంలో వేదిక ప్రచురించిన విశిష్ట పుస్తకాల వివరాలు : (2022 - 2023)

**1. ఒకే వ్యక్తి - అనేక జీవితాలు : రాహుల్ సాంకృత్యాయన్** (మరపురాని మహాద్భుతం మహాపండిత్ రాహుల్ సాంకృత్యాయన్ జీవితం, కృషికి సంబంధించి 25 అరుదైన వ్యాసాలతో కూడిన ఈ విలువైన సంకలనం మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) కి అంకితం చేయబడింది.)

**2.పర్యావరణ పరిరక్షణ: శాంతికి,సంతోషానికి,సంతృప్తికి మార్గం.** (కీ. శే.సుందర్లాల్ బహుగుణ 95వ జయంతి సందర్భంగా, మహత్తర చిప్కో మహోద్యమానికి 50 ఏళ్ళు పూర్తయిన సందర్భంగా ప్రచురించిన పుస్తకం. ప్రతీ పౌరుడు పర్యావరణ స్పృహ కలిగిన ప్రతి వ్యక్తీ తప్పనిసరిగా చదవాల్సినది.)

**3. మన కర్తవ్య మార్గం: మానవీయ,రాజకీయ,సామాజిక, ఆర్థిక జీవన పాశ్వాలు.** (మహత్తర గదర్ మహోద్యమానికి 110 ఏళ్ళు పూర్తయిన సందర్భంగా గదర్ పార్టీ వ్యవస్థాపక అధ్యక్షుడు, భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న యోధుడు బాబా సోహన్ సింగ్ భాక్నా రాసిన అరుదైన వ్యాసం ఇది. భగత్ సింగ్ తల్లి విద్యావతి ప్రచురించిన ప్రతీ దేశభక్తుడు చదవాల్సిన పుస్తకం.)

**4. సైన్స్ అంటే ఏమిటి? : పిల్లల కోసం విజ్ఞాన శాస్త్రం కథ** (వినోద్ రైనా & డి.పి. సింగ్ రాసిన ఈ పుస్తకానికి సత్యనారాయణ లాల్ కర్న్ వేసిన బొమ్మలు అదనపు ఆకర్షణ. భోపాల్ లోని ఏకలవ్య ప్రచురించిన దీనిని మహత్తర సత్య శోధక్ సమాజ్ మహోద్యమానికి 150 ఏళ్ళు పూర్తయిన సందర్భంగా తెలుగులో మొదటిసారి సైన్స్ కార్యకర్తలకు అంకితం ఇచ్చి ప్రచురించడం జరిగింది.)

**5. పిఠాపురం మహారాజా శ్రీ ఆర్. వి. కె. ఎమ్. సూర్యారావు బహదూర్.** (కీ. శే. ఐ. వి. చలపతిరావు ఆంగ్లంలో 35 ఏళ్ళ క్రితం రాసిన ఈ పుస్తకం తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించగా ఉత్తమ జీవిత చరిత్రగా సాహిత్య అకాడమీ బహుమతి పొందింది. ఆంధ్రా స్కూల్ ఆఫ్ ఇండియన్ ఆర్ట్స్ స్థాపనకు 100 ఏళు ళ్ళ పూర్తయిన సందర్భంగా తెలుగులో ఈ పుస్తకం పరిచయం చేస్తూ ప్రచురించాం.)

**6. మహాత్మాగాంధీ :** (మహామానవుడి అమరత్వానికి 75 ఏళ్ళయిన సందర్భంగా రాజ్యాంగ పరిషత్ అధ్యక్షుడిగా పనిచేసిన మేధావి డా. సచ్చిదానంద సిన్హా గాంధీజీ పై రాసిన వ్యాసాన్ని బీహార్ లోని పాట్నా గ్రంథాలయం నుండి స్వీకరించి ఇలా తెలుగులో ప్రచురించడం జరిగింది.)

**7. ప్రజాపక్ష మేధావి – ప్రత్యామ్నాయ చరిత్రకారుడు , డి. డి. కొశాంబి** (దామోదర ధర్మానంద కొశాంబి 115వ జయంతి సందర్భంగా ఇండియన్ నేషనల్ సైన్స్ అకాడమీ అమృతోత్సవాన్ని పురస్కరించుకుని ప్రఖ్యాత శాస్త్రవేత్త, వైజ్ఞానికోద్యమ కార్యకర్త అరవింద్ గుప్తా రాసిన వ్యాసం తెలుగు అనువాదమైన ఈ పుస్తకం విఖ్యాత బౌద్ధ పండితుడు, పాళీ భాషావేత్త, మహామేధావి ధర్మానంద కొశాంబికి అంకితం ఇవ్వడం జరిగింది.)

**8. కాకినాడలో ఒక సాంఘిక సంస్కరణ : కాంగ్రెస్ 1923 మహాసభల శతవార్షిక సమాలోచన.** (కీ. శే. యలమంచిలి వెంకటప్పయ్య గారి 125వ జయంతి సందర్భంగా ఆయన స్వీయచరిత్ర 'బీదబ్రతుకు' లో అనుబంధంగా ఇచ్చిన కాకినాడ మహాసభ ల గురించిన విలువైన వ్యాసం పునర్ముద్రించడం జరిగింది.)

**9. నాకో భార్య కావాలి :**(ప్రముఖ అమెరికన్ స్త్రీ వాద రచయిత్రి, ఉద్యమకారిణి జడీ బ్రాడీ ప్రఖ్యాత వ్యంగ్య రచన I Want A Wife వ్యాసం, ప్రముఖ సామాజిక ఉద్యమకారిని అనురాధా గాంధీ స్మృతిగా తెలుగులో ప్రచురించడం జరిగింది.)

**10. ప్రజలకోసం పాత్రికేయం : ప్రమాణాలు – ప్రభావాలు.** (గణేష్ శంకర్ విద్యార్థి మహత్తర ప్రతాప్ పత్రికకు 110 ఏళ్ళు పూర్తయిన సందర్భంగా మహానుభావుడు శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య గారికి అంకితం ఇవ్వబడ్డ ఈ సంకలనంలో వివిధ పత్రికల్లో పనిచేసిన జర్నలిస్టులు రాసిన 10 వ్యాసాలు ఉన్నాయి. ఆదర్శ జర్నలిస్టుగా ఆచరణాత్మక జీవితం గడిపిన బాంబు స్మృతిలో తీసుకురావడం జరిగింది.)

ప్రతుల కొరకు సంప్రదించండి

**మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) స్మారక వేదిక, పిఠాపురం**

# ముగింపు మాటలు

బాంబుగా అందరికీ తెలిసిన సత్యనారాయణశాస్త్రి మరణం ఎంతోమందిని కదిలించింది. అటు ఛత్తీస్‌గఢ్ మొదలుకుని ఇటు కర్ణాటక సరిహద్దు వరకూ, తెలంగాణా హైదరాబాద్ నుండే కాక ఉత్తరాంధ్రలోని శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, పార్వతీపురం దాకా, గుంటూరు, తణుకు, రాయలసీమ, కృష్ణ, గోదావరి....ఇలా అనేక ప్రాంతాల నుండి సంస్మరణ సమావేశానికి దూరాభారం అనుకోకుండా ఎంతోమంది కదలివచ్చారు. బంధువులు, ఆత్మీయులు, స్నేహితులు, శ్రేయోభిలాషులు, భావోద్యమకారులు, అభిమానులు, వివిధ సందర్భాలలో ఆయనతో పనిచేసినవారు, పాత్రికేయులు ఎంతోమంది రాలేకపోయినా విదేశాల నుండి కూడా వారి సంతాప సందేశాలు పంపించారు. ఒకదశలో ఆ రోజు అందరి సందేశాల్ని రికార్డు చేయడం కూడా కష్టమయింది. సమయాభావం వలన ఇంకా చాలా మంది అభిప్రాయాలను పంచుకోలేకపోయారు. ఈ సంస్మరణ సంచిక కూడా చివరి నిమిషంలో హడావుడిగా తీసుకుని వచ్చే ఆలోచన చేసిందే. కాని అందరి భావాలకి చోటు కల్పించలేకపోయాం. అందుకు క్షంతవ్యులం. ఇంకా బాంబు మరణానంతరం స్పందించి ప్రత్యేకంగా కాలమ్స్ రాసిన అనేక పత్రికలను భద్రపర్చుకోలేకపోయాం. ప్రజాపత్రిక ఒక ఫుల్ పేజి కవర్ చేసి సభలో పంచడం జరిగింది. అలానే ఎంతో మంది జర్నలిస్టులు వచ్చారు. ఆయన పేరిట విగ్రహాలు, ఏవో సేవా కార్యక్రమాల రూపకల్పన కూడా హితులు చేసారు కానీ ఆచరించవలసిన విలువల పట్లే కాని ఆరాధించాల్సిన విగ్రహాలు, ఆడంబరాల పట్ల ఆయనలాగే మాకూ ఏమంత సదభిప్రాయాలు లేవు. ఆయన గొప్పతనం సామాన్యంగా బతకడంలోనే ఉంది. సామాన్యుల పక్షం వహించడంలోనే ఉంది. అంతిమంగా ఆయన జీవితం సామాన్యులకే అంకితం.

తనని తాను సామాన్యుడిగా భావించుకునే ప్రతి ఒక్కరికీ ఆయన దగ్గరివాడే. అందుకోసం అనవసర ఆడంబరాలు, అతి డాంబికాలు అవసరం లేదు. ఈ గ్రంథం కూడా అలా సామాన్యుల కోసం రూపొందించిందే, అక్షర దోషాలకూ, అన్వయ లోపాలకూ పూర్తి బాధ్యత మాదే. ఎవరి అభిప్రాయాలనైనా ఇందులో చేర్చకపోతే అది సమయాభావం వల్ల జరిగిన పొరపాటే కానీ మరే దురుద్దేశమూ లేదని మరోసారి విన్నవించుకుంటూ ఆయన జీవితం నుండి గుప్పెడు మంది భావితరాల యువజనులు స్ఫూర్తి పొందినా, ఈ అక్షరాలకు అంతకు మించిన సార్ధకత వేరే ఏదీ లేదని సవినయంగా తెలియజేసుకుంటూ సెలవు.




**మేకా సత్యనారాయణశాస్త్రి (బాంబు) స్మారక సమితి,**

పిఠాపురం

**అనుబంధం**

# ఒకానొక ప్రస్థానం గురించిన ప్రస్తావన

## (మా తాత రాసుకున్న పాత డైరీ వాసన)


1983

చిట్టిళ్ళ నరసింహ మూర్తి గారి ది. ఈ పుస్తకం

ఎడ్రస్సు:

చిట్టిళ్ళ నరసింహ మూర్తి,

రాయపూర్

ఈ పుస్తకం ... మంథా నరసింహ మూర్తి

గారు ఇచ్చినది.





మా అమ్మ నాన్న చిట్టెళ్ళ నరసింహమూర్తి ఉత్తరాంధ్ర లోని విజయనగరం నుండి మధ్య భారతం,ఈనాటి చత్తీస్‌గఢ్ రాజధాని నగరం అయిన రాయపూర్కి వలస వెళ్ళారు. ఐదుగురు పిల్లల్లో రెండో కుమార్తె అనూరాధ, మా అమ్మ.ఆ కుటుంబానికి జీవనాధారం పౌరోహిత్యం. ఆయన 80వ దశకంలో ఢిల్లీలో మంథా నరసింహమూర్తి ఇచ్చిన డైరీ లో కొన్ని విషయాలు అపురూపంగా రాసుకున్నారు. అది అలహాబాదుకి చెందిన ఒక వ్యాపార సంస్థ డైరీ. కుటుంబ వ్యవహారాలు, కూతుర్లు కొడుకుల సంగతులు, ఇంటి ఖర్చులు తదితరాంశాలు అందులో ఉన్నాయి. ఐతే, అంతమాత్రం లో అదేదో అద్భుతమైన విషయం కాదు. అందులోనూ నాగరిక సమాజానికి అన్ని సౌకర్యాలు అందుబాటులోకి

వచ్చేసినప్పుడు ఒక బీద సంసారి రాసుకున్న కాగితం ముక్కలకి ఏమంత విలువుంటుందీ ?

మనిషి జీవితంలో గడిచిన ప్రతిక్షణం గతంలో భాగమే. అందులో కొంతవరకే చరిత్రగా నమోదు అవుతుంది. మిగిలినదంతా కాలగర్భంలో కలిసి పోతుంది. అలా నలభై ఏళ్ళ క్రితం మా తాత రాసిన ముప్పై పేజీల ఈ డైరీ నా కంటబడి దాదాపు ఇరవై ఏళ్ళవుతోంది. ముఖ్యంగా 'దక్షిణ యాత్ర ఎలాగున చేసితినో రాస్తున్నా' అంటూ వరుసగా నాలుగు పుటలు రాసారు. దక్షిణాది అంటూ ఆయన పేర్కొన్నది నిజానికి చాలా కొంత భౌగోళిక ప్రాంతం మాత్రమే. అయినప్పటికీ నా ఉత్సుకతకి కారణం లేకపోలేదు!

నేను పుట్టే నాటికి మా తాత అమర్‌నాథ్ యాత్రలో ఉన్నారు. 24.07.1987 ఉదయం చి.సౌ. రాధకు మగపిల్లాడు పుట్టాడని డైరీలో రాసారు. అంతేకాక, యాత్ర వివరాలు రాస్తూ 'అమర్‌నాథ్ యాత్ర చాలా కష్టమైనది' అని రాసారు. అందులో ఉన్న మరో విశేషం, 14. 8. 1987 న 'అమర్'ని ఉయ్యాల లో వేశారు " అని నోట్ చేసారు. నా మొదటి పేరు 'అమర్' గా అలా తాత తన యాత్రలోనే పెట్టేసారు. తర్వాత కొద్ది కాలం అనేక పేర్లతో పాటు అమర్ పేరిట కూడా రచనలు చేసాను!

ఓం ప్రథమంగా శ్రీరాములుతో ప్రారంభించిన ఆయన ఉమాశంకర్ శుక్లా బాడా అడ్రసుతో తెలుగు సంవత్సరాల పేర్లు, మనుమలు పుట్టిన తిధివార నక్షత్రాల నుండి ఇంట్లో కుట్టు మిషను కొన్న తారీఖు, ఇల్లు మారిన తేదీ, మృత్యుంజయ మంత్రంతో మొదలెట్టి భుంగ పంచకం, లక్ష్మీ గణపతి మూల మంత్రం, ఇంకా బదరీ కేదర్ యాత్ర గురించి కూడా ఆయన రాసుకున్నారు. మనలో ఎంతోమంది లాగానే డైరీ రాయడాన్ని కొనసాగించలేకపోయారు. ఐనప్పటికీ నా వరకూ నాకిదో విలువైన Documentation గా పనికొచ్చేదే!

ఏయే తేదీల్లో ఏయే ఊర్లకి చేరి అక్కడ ఉండి వెళ్ళారో

రాసుకున్నాయన, ఈ నాలుగు పుటల్ని పూర్తి చేసి ఇట్లు 'చిట్టెళ్ళ నరసింహమూర్తి' అంటూ సంతకం చేసారు. చాలా క్లుప్తంగా అయినా ఒక వలస కుటుంబ వాసనలతో తిరిగి తెలుగు ప్రాంతాన్ని కొత్త కళ్ళతో పరికించి ఔద్వేగానుబంధంతో తన అనుభూతులు అక్షరాలుగా మలిచిన తాత ఆలోచనలకి ఆ మేరకు గౌరవం కల్పిస్తూ ఆయన స్వహస్తాలతో రాసిన నాలుగు పుటల్ని ఇలా పేర్కోవడమే మార్పులకు లోనవుతున్న పాత కొత్త తరాల స్రవంతులకి నేనిచ్చే నివాళిగా భావిస్తున్నాను!

అప్రస్తుతం కాదు కనుక ఇక్కడే మరొక విషయం చెప్పుకోవాలి. మా అమ్మ వాళ్ళ నాన్న చిట్టెళ్ళ నరసింహమూర్తి, మా అమ్మమ్మ లక్ష్మీ విలాసం. అలాగే మా పితామహులు, నాన్న తల్లిదండ్రులు మేకా కృష్ణమూర్తి, నాన్నమ్మ కృష్ణవేణి, వీరిది కూడా ఉత్తరాంధ్ర ప్రాంతం రాజాం, పార్వతీ పురం. తాత పొట్టపట్టుకుని మద్రాసు వెళ్ళి అక్కడ చాలాకాలం ఉన్నారు. ఫార్మాసిస్ట్ గా ఆయనకి కిర్లంపూడి షుగర్ మిల్స్ లో వచ్చిన ఉద్యోగం కోసమే గోదావరి జిల్లాకు రావడం జరిగింది. తర్వాత ఆ ఫ్యాక్టరీని పిఠాపురానికి తరలించడం జరిగింది. పిఠాపురంలో శిథిలావస్థలో ఉన్న ప్రస్తుత ఫ్యాక్టరీ ఇదే !

అలా ఉత్తరానున్న నాటి మధ్యభారతం నేటి చత్తీస్‌గఢ్ కీ, దక్షిణ ద్రావిడ ప్రాంతమైన మద్రాసు రాష్ట్రానికి ఉత్తరాంధ్ర నుండి వలసపోయిన రెండు కుటుంబాల చిహ్నాలు చిన్నప్పటి నుండి మా కుటుంబంలో ఉన్నాయి. సంస్కారం మన సంస్కృతి లోని సంకర స్వభావం వల్లనే అబ్బుతుంది. బహుళ బతుకుల మేళవింపుతో గుభాళిస్తుంది. అలా, భిన్నత్వానికి తలుపులు తెరిచే ధోరణికి మానవాళి రాగలగడమే అసలైన ఆధునికత అంటాన్నేను !

ఛాందస సాంప్రదాయ వాసనలతో బీదరికపు ఛాయల్ని మోసుకుని వలసపోయిన అలనాటి ఇరు కుటుంబాల నీడల్లోనే నా బాల్యం గడిచింది. ఒకపక్క అక్కరకురాని గొప్ప వార సత్వం, మరోపక్క మార్పుకు మాధ్యమంగా మారిన వ్యవస్థ లో ఆధునిక వైనాలు, మొత్తం గా కలగలిసి భయంకరమైన

దరిద్రాన్ని ఈ దేశ ప్రజలకు అంటకట్టాయ్. భౌగోళికంగా, భౌతికంగా, బౌద్ధికంగా దశాబ్దాల పాటు కొనసాగిన బీదబ్రతుకులకి మూలం ఇదే !

Social & Culture Privilege ఉన్న ఇలాంటి కుటుంబాలే కాక పాత పద్ధతులను ధిక్కరించి ఉనికి కోసం ఊర్లు దాటిన కోట్లాది మంది కథల వ్యధలు ఇంకా తెలియాల్సి ఉంది. ముఖ్యంగా, ఈ దేశ మూల వాసులు, దళిత బహుజన ఆదివాసీ మైనారిటీలకి ఈ స్పృహ పెరగాల్సి ఉంది. అంటరాని వసంతం అన్నట్లు "తవ్వాల్సిందీ పూడ్చాల్సిందీ చాలా ఉంది." ఆ క్రమంలో సాంస్కృతిక ఒత్తిళ్ళకి లోనైన ఒక సగటు వ్యక్తి వృద్ధాప్యంలో చేసిన చిన్న యాత్ర తాలూకా ఊసులుగా వీటిని రికార్డు చేయడం అవసరం అనిపించింది!

త్వరలోనే కనుమరుగు కానున్న తాత డైరీని గురించి నాలుగు మాటల పరిచయం అందుకే. ఒకనాడు మనుషులతో మమేకం కావడం పొట్టకూటి కోసం కొత్త ప్రదేశాలకు ఇద్దరు చేసిన ప్రయాణం, తర్వాత కాలంలో నేను చేస్తున్న అవిశ్రాంత ప్రస్థానానికి, కుటుంబంలో అప్రయత్నంగానే కొనసాగుతూ వచ్చిన దేశ దిమ్మరితనానికి ఒకానొక ప్రేరణ కాగలిగిందనేదే నా భావం, అందుకే ఈ కార్యం !

(అత్యుత్సాహంతో పదిహేనేళ్ళ క్రితం నేను అమర్‌నాథ్ యాత్ర వెళ్ళి తిరుగు ప్రయాణంలో రాయ్ పూర్లో ఆగినప్పుడు చూసిన ఈ డైరీలోని కొన్ని పేజీల్ని అప్పట్లో జిరాక్స్ కూడా తీసుకున్నా. మొన్న ఏదో సందర్భంలో అమ్మమ్మని అడగ్గా అక్కడి నుండి పంపించింది. శిథిలావస్థలోకి చేరిపోనున్న ఒక జ్ఞాపకానికి చిరుస్మృతిగా ఈ చిన్న రైటప్ !)

**- గౌరవ్**

# కొన్ని మధుర జ్ఞాపకాలు
# మరియు బాంబు స్మృతులు















# గౌరవ్, రోహిత్, తేజాల చిన్ననాటి చిత్రాలు













# బాంబు పరిశోధనాత్మక రచన

దుర్మార్గపురాతలతో
తెలుగు దేశంలో
తెలుగు పాఠకుడ్ని
తెలివితక్కువవాడిగా
అంచనావేస్తూ
యువతరాన్ని
అతి దారుణంగా
భయంకరంగా
తప్పుదారిపట్టిస్తు-
అదేరహదారని
అపోహకలిగిస్తున్న
ఓ పత్రికాధిపతి....
నిజచరిత్రే
ఈ పుస్తకం

'ENCOUNTER DASARADHARAM BANDARAM' Rs. 5/-

యువజర్నలిస్ట్ బాంబు కలం నుండి త్వరలో

రాజకీయ
"వ్యభిచారులు-
తార్పుడు గాళ్ళు"

"మన రాజకీయరంగాన్ని కలుషితం చేస్తున్న వ్యభిచారుల, తార్పుడు గాళ్ళ నిజ చరిత్ర"
విడుదలకు సిద్ధంగా వుంది.

వెల : 3-00 రూ.

కాపీలకు :
M. S. N. శాస్త్రి
పీస్ హోమ్, స్టువార్టు పేట.
పిఠాపురం - 533 450.

50

ఛీటర్ దశరథరామ్‌కి

నేను నీ మేడిపండులాంటి జీవితం గురించి ప్రజలకు ఉన్నది ఉన్నట్లుగా, తెల్సింది తెల్సినట్లుగా చెబుతున్నాను. నీ బ్రతుకుని నడిబజార్లో పెడుతున్నాను. అనేకమంది నీ బ్రతుకుని చదివి, నీ గురించి తెలుసుకొంటారు. నీవు ఎన్‌కౌంటర్‌లో వ్రాస్తున్న రాతలతో నీ బ్రతుకును బేరీజు వేసుకొంటారు. నీ పాఠకులందర్ని మోసం చేయగలిగావుగాని నన్నుమాత్రం ఏమీ చెయ్యలేవు. ఇందులో నేను నీపై చేసిన ఆరోపణలపై నీకు అభ్యంతరాలుండవచ్చు. అయితే నీకు దమ్ముంటే ప్రజాస్వామ్యంమీద అచంచల విశ్వాసముంటే పిఠాపురం కోర్టులో తేల్చుకుందాం...రా!

—బాంబు

ఎన్‌కౌంటర్ దశరథరామ్ కో ఛాలెంజ్....!

ఆంధ్రదేశంలో గత నాలుగు సంవత్సరాలుగా అన్యాయాలమీద అక్రమాలమీద అవిశ్రాంత పోరాటం చేస్తున్నానంటూ తెలుగు జర్నలిజం చరిత్రలోనే సంచలనం అంటూ గురివిందగింజలా నీలో వున్న తప్పులు ప్రజలకు తెలియకుండా జాగ్రత్తపడుతూ ఆంధ్రదేశంలో సంచలన పత్రికాధిపతిగా ఎష్టాబ్లిష్ అవుతున్న నీవు రాజకీయ రంగంలోకూడా పటిష్టంగా పాతుకపోవాలనే దురాశతో రాజమండ్రి నుండి పోటీచేసి బోర్లాపడి చావు తప్పి కన్ను లొట్టబోయిందన్న విధంగా యింతకాలంగాప్రజలనుచేస్తున్న మోసాన్ని బయట పెట్టాలనే ఉద్దేశ్యంతో నీదగరచేరి నీగుట్టు యావత్తు బయటపెట్టడాన్కిగాను నేను చేసిన సాహసం తెలుగు పరిశోధనా జర్నలిజం చరిత్రలోనే ఓ మైలురాయిగా నిలిచిపోతుంది. దేశంలో అన్నిచోట్ల కేన్సర్‌వ్యాధికన్న అతి భయంకరంగా పట్టి పీడిస్తున్న మోసాల్ని అవినీతులమీద పోరాటం చేస్తున్నానని ఎన్‌కౌంటర్‌లోవ్రాసుకొంటున్న నువ్వు రెంటికి అతీతుడవుకావని బురదలో పందిలా వాటిలోనే పొర్లుతున్నావని అయితే నీవు వేసే రంకెలు మాత్రమే నీతిగా వుంటున్నాయని ప్రజలకు చాటిచెప్పడమే నా ధ్యేయం. ఆనాధ్యేయ ప్రతిఫలమే యీ పుస్తకం. నీవు వ్రాసే రాతలమీద నీకు నమ్మకంవుంటే నీసేమైనా జర్నలిస్టువని అనుకొంటూవుంటే ఇప్పటికైనా నిజం ఒప్పుకొని యింతకాలంగా తెలుగు ప్రజల్ని మోసంచేసినందుకుగాను నీ ఎన్‌కౌంటర్‌పాఠకుడు ఒక్కొక్కడు నీ యీ జీవితనిజాలు తెలుసుకొని నిన్ను కాలరు పట్టుకొని చెప్పిచ్చుకు కొట్టకముందే ప్రజా న్యాయస్థానంముందు క్షమాపణ చెప్పుకొని మానవత్వంగల మామూలు మనిషిగా బ్రతకడం నేర్చుకో.

....బాంబు....
జర్నలిస్టు, స్టువార్టుపేట,
పిఠాపురం....533 450.

బాంబు పరిశోధనలో

ఎన్‌కౌంటర్
దశరధరాం
బండారం

ఎన్‌కౌంటర్

# బాంబు రాసిన కొన్ని కరపత్రాలు

మన సంపద | మన ఆయిల్ /గ్యాస్

## ఆలోచించండి !

**మన పెరట్లో ఉన్నకొబ్బరి చెట్లకాయలు దింపటం మనకు రాకపోతే మనము ఏమి చేస్తాం?**

**✓ కాయలు దింపటం వచ్చినవాళ్ళని 'కూలికి' పెట్టుకొని కాయలు మనము తీసుకొని దింపుకూలీ వాళ్ళకు ఇస్తాం......**

ఈ సామన్య న్యాయ సూత్రం తెలియని చవటలు, దద్దమ్మలు పాలకులుగా ఉంటే జరిగే నష్టానికి పరాకాష్ఠ మన కేజీబేసిన్ గ్యాస్ / ఆయిల్ నిక్షేపాల వివాదం. వెలికితీసిన సంపద మొత్తం కూలిచేసిన ప్రైవేటు కార్పొరేట్ సంస్థలు పట్టుకు పోతుంటే వెర్రిమొహాలు వేసుకొని చూస్తూ ఊరుకోవడం మహా దారుణం.

బ్యాంకులను జాతీయం చేసిన విధంగానే మన కేజీ బేసిన్ గ్యాస్/ఆయిల్ నిక్షేపాలను కూడా ఆర్డినెన్స్ ద్వారా జాతీయం చేయాలని డిమాండ్ చేస్తూ పై విధంగా సామన్యప్రజలను, రాజకీయనాయకులను,అధికారులను కార్యోన్ముఖులను చేయడానికి

దిి.27-08-2009 గురువారం రాత్రి 9గం॥ నుండి ఆమరణ నిరాహారదీక్ష డోర్ నెం.8-2-45, ఉప్పాడరోడ్‌లో నా గృహమునందు శిబిరం ఏర్పాటు చేయాలని నిర్ణయించాను. కావున మీ అందరి మద్దతు తెలిపి మన గ్యాస్/ఆయిల్ నిక్షేపాలను మనమే కాపాడుకుందాము.

మీ
ఎమ్.ఎస్.ఎన్. శాస్త్రి (బాంబు)
పిఠాపురం,
సెల్ : 9441038015

---

## బూడిద బాధితులారా కలసిరండి !

షుగర్ ఫ్యాక్టరీ చిమ్ని ద్వారా వెదజల్లబడుతున్న బూడిద, నల్లని రేణువులు, మనల్ని నిత్యం బాధిస్తూనే ఉన్నాయి వాటిని అరికట్టండంటు ప్యాక్టరి యాజమాన్యాన్ని జిల్లా అధికారులను, యెన్నిమార్లు మొరపెట్టుకున్నా స్పందించడం లేదు. కాలుష్య నివారణ కోరుతూ

**"ఆమరణ నిరాహరదీక్ష" ది 16-1-95**

రాత్రి 9 గం॥ నుండి జరపడానికి నిర్నయించాము రాజకీయ పార్టీల ప్రమేయం లేకుండా బూడిద బాదితులు అందరూ సహకరించవలెనని కోరుతూ.....

పిఠాపురం
[illegible]-1-95

M. S. N. శాస్త్రి [బాంబు]

శ్రీనివాస ప్రింటర్స్, కోటగుమ్మంవద్ద, పిఠాపురం. ఫోన్ 594

---

## "ఆలోచించండి"

### కార్మిక కర్షక సోదరులారా! ఆలోచించండి!!

మీలో రైతులుగాని, యాజమాన్యంగాని, కార్మికులుగాని, మాకు శతృవులు కారు. మీ ముగ్గురి కలయిక, మా పట్టణ అభివృద్ధి. మీ క్షేమమే మా అకాంక్ష!

గడచిన 40 సంవత్సరములనుండి ఈ ఫ్యాక్టరీ మాకు ప్రత్యక్షముగాను, పరోక్షముగాను అదరించి అన్నం పెట్టింది జాతీయ స్థాయిలో ఈ పట్టణానికి పేరు తెచ్చింది. 5 సంవత్సరములకు ముందువరకు మాకు ఈ బూడిద బాధలేదు.

ఫ్యాక్టరీ యాజమాన్యానికి-రైతులకు, యాజమాన్యానికి-కార్మికులకు, మధ్య వచ్చే చిన్న చిన్న వివాదాలను యిరువర్గాలను బుజ్జగించి, నచ్చచెప్పి చక్కదిద్దు కున్నాము. ఈ ఫ్యాక్టరీ నిరాటంకముగా, నిర్విఘ్నముగా నడవటానికి అందరం సహక రించుకున్నాము.

అందరం ఒకే కుటుంబముగా కలిసికట్టుగా పోతున్న మనలో "బూడిద" వచ్చి కలతలు లేపాలని చూస్తోంది. "బూడిద ప్రజలమీదకు రాకుండా ఈ ఫ్యాక్టరీని నడిపించడం అసాధ్యముకాదు". రైతుల శ్రేయస్సుకోసం, కార్మికుల సంక్షేమంకోసం, ఫ్యాక్టరీ అభివృద్ధికోసం, మా యిబ్బందులను, అసౌకర్యములను, మరచిపోయి మీతో సహకరించాము. యికముందు గూడ సహకరిస్తాం—కాని తినేతిండివి, తాగే నీటిని, పీల్చే గాలిని విచక్షణా రహితముగా కలుషితముచేసి మా బ్రతుకులను "బుగ్గిపాలు" చేసే విధముగా బూడిద వెదజల్లితే ...ఆ విషయాన్ని యాజమాన్య దృష్టికి తెచ్చి, నచ్చజెప్పి, ఒప్పించాల్సిన గురుతర బాధ్యతమీది! మీలో ప్రతి ఒక్కరిదిను!! తీయటి చెరకు పండించే రైతులు, తీయ తీయటి చెక్కర పట్టే కార్మికులు, యాజమాన్యానికి రెండు కళ్ళు. ఆ రెండు కళ్ళు "బూడిదనలుసులు" పడి నీళ్ళు కారుస్తున్నాయి. కన్నీళ్ళు కార్చిస్తున్నాయి.

మా గురించి ఒక్క క్షణం ఆలోచించండి అని మీ మీద విశ్వాసంతో దీనంగా చూస్తున్నాము. మా సమస్యకు సానుభూతితో సహకరించి, పరిష్కరించమని సవినయంగా మిమ్మల్ని కోరుతున్నాము.

ది 16-1-1995 సోమవారం రాత్రి 9 గంటలనుంచి మేము తలపెట్టిన "సమస్య పరిష్కారాంత నిరాహార దీక్ష"కి సహకరించవలసినదిగా కోరుచూ ...

పిఠాపురం
9—1—1995

M. S. N. శాస్త్రి [బాంబు]

---

KG BASIN GASS వివాదంపై

## నా 'గుండెచప్పుడు'...

సుమారు 2 సం॥ల నుండి మన భూభాగంలో పైపులైన్లువేసి గ్యాసి గుజరాత్ రాష్ట్రాని పట్టుకుపోతున్న ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి నరేంద్రమోడి మన రాజకీయ నాయకుల కిచ్చిన 'బిరుద 'వాజమ్మలు' అని !!!!

2సం॥లుగా మన గ్యాసి గుజరాత్ పట్టుకుని వెళ్ళి సిలిండర్ ధర రూ100/-కు అమ్ముతూ ఆ రా ప్రజల అవసరాలు చవకగా తీరుస్తున్న ముఖ్యమంత్రి మోడీకి 'జోహార్లు'. అదే గ్యాస్‌ను మన రాష్ట్రం రూ300/-కు అమ్ముచున్న మన రాజకీయనాయకులను ఏమందాం ?

టి.వి.ల్లో, పత్రికలతో ఉద్యమాలురావ్వు! ఉద్యమాలకు ప్రేరణ మాత్రమే వస్తుంది! ఆప్రేరణతో ఉద్యమాల నిర్మితమవ్వుతాయి, గడచిన 2సం॥లుగా మన గ్యాసి తరలిపోతోందని 'మీడియా' ఎంత గోలపెడుతున్నా మన "సంపద" కాపాడుకోవడానికి మనకున్న మార్గాలేమిటని... ఆలోచన కూడా.... చేయలేని ధారుణ "నిర్లిప్తదొరణి" లో మన సమాజం ఉండిపోయిందంటే... అంతకంటే విచారించ దగ్గ విషయం మన జాతికి మరొకటి లేదు.

రవి అస్తమించని బ్రిటీషి సామ్రాజ్యాన్ని గడగడ లాడించిన...... గాంధీ, పటేల్, నెహ్రూలకు 'వారసులమేనా'... మనం ?

సుభాష్ చంద్రబోసె, అల్లూరి సీతారామరాజు, భగత్‌సింగ్ వంటి 'పోరాటయోధులు' రక్తం మనలో కూడా ఇంకా ప్రవహిస్తోందా ?

గానుగెద్దు జీవితాలతో......... జానాబెత్తెడు ఆశయాలతో..... నిర్లజ్జగా, నిస్సిగ్గుగా బతికేయడం....... ఈ జాతికి పట్టిన 'జాడ్యం'.

కనీసం యువతరమైనా....

'కంప్యూటర్ పద్మవ్యూహం' లోంచి బయటపడి... నిజాలు ఆలోచించాలని, నిజంగా బ్రతకాలని!

మన స్వాతంత్ర్య ప్రధాతల నిజమైన వారసులమని నిరూపించుకోవాలని... యువతరాన్ని ఉత్తేజ పరచడానికి, కర్యోన్ముఖులను చేయడానికి..జాతి గర్వించదగ్గ 'శక్తి' గా ఆలోచించాలని, ఆచరించాలని, అవతరించాలని.

మోడీ లాంటి KDగాళ్ళకు సమాధానంచెప్పే సత్తా మనయువతరానికి రావాలని.... ఆశిస్తూ ఆకాంక్షిస్తూ...ఈ ఉద్యమం !!!!

అందుకే ఈ 'నిరాహారదీక్ష' ప్రారంభిస్తున్నా

మీ 'మద్దతు' కోరుతూ....
M.S.N. SASTRY (బాంబు)
పిఠాపురం
సెల్ : 9441038015.

# బాంబు చేసిన ఉద్యమాలకి సంబంధించిన పత్రికా వార్తల్లో కొన్ని...

## 'అన్నవరం' వ్యవహారాలపై హైకోర్టులో పిటీషన్ : బాంబు

పిఠాపురం, మార్చి 20 (ఆన్‌లైన్): అన్నవరం దేవస్థానంలో చోటుచేసుకొంటున్న వ్యవహారాలపై రాష్ట్ర హైకోర్టులో ప్రజాప్రయోజనాల పిటిషన్ దాఖలు చేసినట్టు బ్రాహ్మణ్ వెల్ఫేర్ అసోసియేషన్ కన్వీనర్ ఎంఎస్ఎన్ శాస్త్రి (బాంబు) తెలిపారు. ఆదివారం తన నివాసంలో ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో పిటిషన్ దాఖలుకు దారితీసిన పరిస్థితులను ఆయన వివరించారు.

అన్నవరం దేవస్థానంలో వ్రతపురోహితులకు వ్రతాల రుసుంలో 30 శాతం కమీషన్ చెల్లిస్తున్నారని ఆయన చెప్పారు. అయితే 2002లో సుప్రీం కోర్టు జారీ చేసిన ఆదేశాల ప్రకారం వ్రత పురోహితులకు కేవలం జీతాలే చెల్లించవలసి ఉందని తెలిపారు. దేవస్థానంలో 155 మంది పురోహితులకు ఏటా రూ. 1.5 కోట్లు కమీషన్ రూపంలో చెల్లిస్తున్నారని ఆయన చెప్పారు. ప్రభుత్వం జారీచేసిన 261 జివోకు విరుద్ధంగా దేవస్థానంలో వ్యవహారాలు నడుస్తున్నాయని ఆయన తెలిపారు.

వ్యవహారాలపై హైకోర్టులో పిటిషన్ దాఖలు చేసి దేవాదాయశాఖ ప్రిన్సిపల్ కార్యదర్శి దేవాదాయశాఖ కమిషనర్, అన్నవరం దేవస్థానం ఇఓ, బ్రహ్మ, ఉపబ్రహ్మలకు ప్రతివాదులుగా పేర్కొన్నట్టు ఆయన వివరించారు. అన్నవరం దేవస్థానం పాఠశాలలోని పదవతరగతి చదువుతున్న అల్లంరాజు వెంకటసత్య ఆనందశర్మ క్లాస్ -4 వ్రత పురోహితుడిగా పనిచేస్తున్నాడని ఆయన తెలిపారు. ఏకకాలంలో చదువు, ఉద్యోగం, ఏలా సాధ్యమని ఆయన ప్రశ్నించారు.

## 27 నుంచి గ్యాస్ కోసం ఆమరణ దీక్ష


ఎం.ఎస్.ఎన్.శాస్త్రి

పిఠాపురం : కేజీ బేసిన్‌లో లభ్యమవుతున్న గ్యాస్, ఆయిల్ నిక్షేపాలను జాతీయం చేయాలని కోరుతూ పట్టణానికి చెందిన ఎం.ఎస్.ఎన్.శాస్త్రి (బాంబు) ఈ నెల 27 నుంచి ఆమరణ నిరాహారదీక్ష చేపట్టనున్నట్టు ప్రకటించారు. ఈ మేరకు తహసీల్దార్ ద్వారా కలెక్టర్‌కు విజ్ఞాపన పత్రాన్ని పంపినట్టు శాస్త్రి సోమవారం విలేకరులకు చెప్పారు. గ్యాస్ నిక్షేపాలను అక్రమంగా తరలించుకుపోతున్నారని ఆయన ఆరోపించారు. రాజకీయ నాయకులను, అధికారులను, ప్రజలను చైతన్యపరిచి కర్తవ్యోన్ముఖులను చేయడం కోసమే తాను దీక్ష చేపడుతున్నట్టు చెప్పారు. మాజీ ప్రధాని ఇందిరాగాంధీ బ్యాంకులను జాతీయం చేసిన విధంగా గ్యాస్ నిక్షేపాలను జాతీయం చేయాలని కోరారు. గురువారం రాత్రి తొమ్మిది గంటల నుంచి స్థానిక పూర్ణా థియేటర్ సెంటర్‌లోని తన స్వగృహంలో దీక్ష చేపట్టనున్నట్టు చెప్పారు.

## ఇదో ట్రాన్స్... 'ఖో'

బిల్లు సవరించకుంటే ఆమరణ నిరశన ఓ సామాన్యుడి హెచ్చరిక

## మూడోరోజుకు చేరిన నిరవధిక దీక్ష

పిఠాపురం, ఆగస్టు 29(ఆన్‌లైన్): కేజీ బేసిన్ గ్యాస్ నిక్షేపాలు జాతీయం చేయాలని కోరుతూ పిఠాపురం సోషల్ యాక్టివిస్ట్ ఎంఎస్ఎన్ శాస్త్రి(బాంబు) చేపట్టిన నిరవధిక దీక్ష శనివారం మూడో రోజుకి చేరింది. శిబిరాన్ని పలువురు స్థానికులు సందర్శించి మద్దతు ప్రకటించారు.


నిరవధికదీక్షలో శాస్త్రి

## ఇదో ట్రాన్స్...'ఖో'

(మొదటి పేజీ తరువాయి)

## ...ండో రోజుకు చేరిన శాస్త్రి ఆమరణ దీక్ష

పిఠాపురం, నవంబర్ 26 (ప్రభాతవార్త):

...రణ నిరాహారదీక్ష చేస్తున్న ఎంఎస్ఎన్ శాస్త్రి

### మద్దతుగా రాస్తారోకో


శాస్త్రికి మద్దతుగా రాస్తారోకో చేస్తున్న మద్దతుదారులు

# ట్రాన్స్‌కో పై సామాన్యుడి పోరు

## సమాన న్యాయం కోసం శాస్త్రి నిరాహారదీక్ష

## పిఠాపురం ఎస్ఐపై బాంబు ఫిర్యాదు

**పిఠాపురం, సెప్టెంబర్ 5 (ఇ.ఎన్.ఎన్):** ట్రాఫిక్ నిబంధనలు పాటించని వారిపై జరిమానాలు విధించడం పోలీసులకు పరిపాటి. అయితే వారే నిబంధనలు అతిక్రమిస్తే... ఈ విషయంలో పిఠాపురానికి చెందిన సోషల్ యాక్టివిస్ట్ ఎమ్ఎస్ఎన్ శాస్త్రి (బాంబు) సీఐకు చేసిన ఫిర్యాదు ఆసక్తికరంగా ఉంది. శాస్త్రి ఫిర్యాదు ప్రకారం వివరాలిలా ఉన్నాయి. ఆయన శనివారం ఉదయం తన మిత్రుడితో కారులో కాకినాడ వెళుతూండగా సీటు బెల్ట్ పెట్టుకోనందుకు గాను పిఠాపురం పట్టణ ఎస్ఐ కె వరప్రసాద్ ఫైన్ విధించారు. జరిమానా కట్టేందుకు సిద్ధపడ్డ బాంబు రశీదు కోరగా సిఐ కార్యాలయానికి కొచ్చి తీసుకోవాల్సిందిగా కోరుతూ కారు రికార్డుల్ని ఎస్ఐ తీసుకుపోయారు. దీనిపై బాంబు స్థానిక సర్కిల్ ఇన్‌స్పెక్టర్ వరప్రసాద్‌కు ఫిర్యాదు చేశారు. రోడ్డుపై ఎడంవైపు ఆటోలు అధికంగా ఉన్నాయని, వాటిని కంట్రోల్ చేయమని అడిగినందుకే తనపై ఎస్ఐ జరిమానా విధించారని ఆయన ఆరోపించారు. సీటు బెల్ట్ పెట్టుకోనందుకు తాము జరిమానా చెల్లించేందుకు సిద్ధమేనని చెబుతూనే పోలీస్ జీపులో ప్రయాణిస్తున్న ఎస్ఐ, జీపు డ్రైవర్ సైతం సీటు బెల్టులు పెట్టుకోనందున వారిపైనా జరిమానా విధించాలని ఆయన ఫిర్యాదులో కోరారు. ఎమ్‌వి యాక్ట్‌లో పోలీసులకు, రాజకీయ నాయకులకు మినహాయింపుల్లేవని చెప్పారు. దీనిపై సిఐ ఏం చర్య తీసుకుంటారనేది ఆసక్తికరంగా మారింది.

## రాజకీయ షాక్ ట్రాన్స్‌కో షేక్

ఎమ్మెల్యేల జోక్యంతో విద్యుత్ కనెక్షన్ పునరుద్ధరణ • శాస్త్రి దీక్ష విరమణ

## బలపడుతున్న శాస్త్రి ఆమరణ దీక్ష

బయటపడుతున్న ట్రాన్స్‌కో అవకతవకలు

నీరుగార్చేందుకు పోలీసుల ప్రయత్నాలు

క్షీణిస్తున్న ఆరోగ్యం

## 'బాంబు'కు మద్దతుగా 'రాస్తారోకో'

పిఠాపురం, నవంబరు 26 : (జనస్పందన విలేకరి) ట్రాన్స్‌కో తీరుకు నిరసనగా ఆమరణ నిరాహార దీక్ష చేస్తున్న పిఠాపురం వినియోగదారుడు ఎం.ఎస్.ఎన్.శాస్త్రికి (బాంబు) మద్దతుగా శుక్రవారం స్థానిక మెయిన్‌రోడ్డులో రాస్తారోకో జరిగింది. తప్పుడు విద్యుత్ బిల్లులు రద్దు చేయాలని కోరుతూ ఎంఎస్ఎన్.శాస్త్రి గురువారం నుంచి నిరాహార దీక్ష చేస్తున్న సంగతి విదితమే. శుక్రవారం సాయంత్రానికి కూడా ట్రాన్స్‌కో అధికారుల నుంచి స్పందన లభించకపోవడంతో ఆగ్రహించిన శాస్త్రి మద్దతుదారులు స్థానిక బంగారమ్మ రావిచెట్టు సెంటర్, సినిమా థియేటర్ సెంటర్‌లలో రెండు పర్యాయాలు రాస్తారోకో నిర్వహించారు. ఈ కారణంగా ప్రధాన రహదారిపై వాహనాలు భారీ సంఖ్యలో నిలిచి పోయాయి. రాస్తారోకోలో పాల్గొన్న వివిధ పార్టీల నాయకులు మాట్లాడుతూ ట్రాన్స్‌కో ద్వంద్వ వైఖరి నశించాలని డిమాండ్ చేశారు. వినియోగదారులు సమస్యలు పట్ల ట్రాన్స్‌కో సమాన న్యాయం చూపాలన్నారు. శాస్త్రి సమస్య పరిష్కరించకుంటే ఉద్యమం తీవ్రతరం చేస్తామని వారు హెచ్చరించారు. రాస్తారోకో కార్యక్రమంలో వివిధ పార్టీలకు చెందిన నాయకులు జనపరెడ్డి రాంబాబు, మార్నీడి వెంకటరమణ, సుంకర శ్రీను, ఏకా సత్యనారాయణ తదితరులు పాల్గొన్నారు.

## 'దేవుడి సొమ్ములో వ్రత పురోహితులకు వాటాపై ప్రజావ్యాజ్యం'

**పిఠాపురం, మార్చి 20 (ప్రభాతవార్త):** ప్రముఖ పుణ్యక్షేత్రమైన అన్నవరం శ్రీవీరవెంకట సత్యనారాయణస్వామి దేవస్థానంలో అవకతవకలు చోటుచేసుకుంటున్నాయని పట్టణానికి చెందిన ఎంఎస్ఎన్ శాస్త్రి(బాంబు) ఆరోపించారు. ఆదివారం పిఠాపురంలో ఏర్పాటు చేసిన విలేకర్ల సమావేశంలో మాట్లాడుతూ సత్యన్నారాయణవ్రతం టిక్కెట్ల అమ్మకాల ద్వారా వచ్చిన ఆదాయం నుంచి వ్రత పురోహితులకు వాటాలు ఇస్తున్నారన్నారు. వ్రతం టిక్కెట్టులో పురోహితులకు వాటా ఉన్నట్టు టిక్కెట్టుపైనే ముద్రించడం, అధికారికంగా 30 శాతం వరకు, భగవంతుని సొమ్ము నుంచి వాటాలు తీసుకోవడం వెనుక అధికారుల అండదండలు వున్నాయన్నారు. ఈ విషయమై ఈ నెల నాలుగో తేదీన తాను హైకోర్టులో ప్రజాప్రయోజన వ్యాజ్యాన్ని దాఖలు చేశానన్నారు.

ఈ దేవాలయంలో ఉన్నతస్థానంలో వున్న వ్రత పురోహితులు ఈ అవినీతికి ఊతమిస్తున్నారని శాస్త్రి ఆరోపించారు. రాష్ట్రంలోని అన్ని దేవాలయాల్లోనూ వ్రత పురోహితులకు, అర్చకులకు వేతనాలు అమల్లో ఉండగా, ఈ దేవాలయంలో మాత్రం దేవుని ఆదాయం నుంచి వ్రత పురోహితులకు కమిషన్ ఇస్తున్నారన్నారు.

2001-02లో 83 లక్షల 55 వేలు, 2002-03లో కోటి రెండు లక్షల 14 వేలు, 2003-04లో కోటి 49 లక్షల 71 వేలు, 2004 నుంచి 2005 జనవరి నెలకు కోటి 37 లక్షల 44 వేలు వ్రత పురోహితులకు వాటాల రూపంలో చెల్లింపులు జరిగాయన్నారు. ఆలయ వ్రత పురోహితుడు చామర్తి వెంకటరావు ఈ ఆలయంలో జరుగుతున్న అవకతవకలపై ముఖ్యమంత్రికి ఫిర్యాదు చేశారన్నారు. దీనిపై విచారణ చేయకుండా ఫిర్యాదు చేసిన వెంకట్రావుకే షోకాజ్ నోటీసును ఆలయ అధికారులు ఇచ్చారన్నారు. ఆలయంలో లేని ఉద్యోగాలను సృష్టిస్తూ వ్రత పురోహితులకు గ్రేడింగ్ విధానం అమలుచేస్తూ నిబంధనలు అతిక్రమిస్తున్నారన్నారు. ఈ దేవాలయ పాఠశాలలో చదువుతున్న అల్లంరాజు వెంకట సత్యఆనందశర్మ(15) అనే బాలుడికి ఉద్యోగ అర్హత లేకున్నా ఉద్యోగం వచ్చేలా చేశారని శాస్త్రి అన్నారు. ఈ దేవాలయంలో అవినీతిపై తాను చట్టబద్ధంగా పోరాటం చేస్తానని శాస్త్రి చెప్పారు.

# విద్యుత్ పునరుద్ధరణ - శాస్త్రి దీక్ష విరమణ



పిఠాపురం, నవంబరు 27 : (జనస్పందన విలేకరి) చర్చలు...సంప్రదింపులు... బేరసారాలు. నేతల జోక్యంతో ట్రాన్సుకోపై వినియోగదారుడు విజయం సాధించాడు. పిఠాపురం ఎం.ఎస్.ఎన్.శాస్త్రి (బాంబు) నిరాహార దీక్ష శనివారం సాయంత్రం ముగిసింది. శాస్త్రి ఇంటికి ట్రాన్సుకో విద్యుత్‌ను పునరుద్ధరించగా, 725 రూపాయలు ఇల్లు భాగంను సోమవారం ట్రాన్సుకోకు చెల్లించడానికి శాస్త్రి అంగీకరించారు. పిఠాపురం ఎమ్మెల్యే పెండెం దొరబాబు, పెద్దాపురం ఎమ్మెల్యే తోట గోపాలకృష్ణ, మాజీ మంత్రి కె.వి.సి.హెచ్.మోహనరావు, మాజీ ఎమ్మెల్యే సంగిశెట్టి వీరభద్రరావు తదితరులు శాస్త్రి చేత నిమ్మరసం తాగించి దీక్షకు ముగింపు పలికారు. ట్రాన్సుకో తప్పుడు బిల్లులకు నిరసనగా బాంబు గత మూడు రోజులుగా నిరాహార దీక్ష చేస్తున్న సంగతి విదితమే.

## నేతల జోక్యంతో సామాన్యుని విజయం

ఈ నేపథ్యంలో శాస్త్రిని పరామర్శించడానికి వచ్చిన నేతలు సమస్య పరిష్కారానికి కృషి చేశారు. ట్రాన్సుకో ఎస్.ఇ. గోపాలకృష్ణతో ఫోన్‌లో చర్చలు జరిపారు. ఒకదశలో ట్రాన్సుకో అధికారులు దిగిరాలేదు. 'నిరాహార దీక్ష చేసిన వారందరి బిల్లులు మాఫీ చేస్తూ పోతే ట్రాన్సుకో దివాలా తీయాల్సి ఉంటుందని ఎస్.ఇ. గోపాలకృష్ణ వ్యాఖ్యానించారు. దీనిపై ఎమ్మెల్యే తోట, మాజీ మంత్రి కె.వి.సి.హెచ్.లు తీవ్ర స్థాయిలో (తరువాయి 2వ పేజీలో)

## ట్రాన్స్‌కోపై 'బాంబు' విజయం




**పిఠాపురం:** విద్యుత్ సరఫరా పునరుద్ధరించి అధిక మొత్తంలో వచ్చిన విద్యుత్ బిల్లును తగ్గించి కట్టించుకునేందుకు ట్రాన్స్ కో అధికారులు ఒప్పుకోవడంతో మూడు రోజులుగా మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) చేస్తున్న దీక్షను శనివారం విరమించారు. ఎమ్ఎల్ఏలు తోట గోపాలకృష్ణ, పెండెం దొరబాబు, మాజీ మంత్రి కొప్పనమోహనరావు, మాజీ ఎమ్ఎల్ఏ సంగిశెట్టి వీరభద్రరావు ఆధ్వర్యంలో శనివారం ట్రాన్స్ కో అధికారులతో జరిగిన చర్చల్లో ఈ మేరకు రాజీ కుదిరినట్లు బాంబు బంధువులు తెలిపారు.

# దిగివచ్చిన ట్రాన్స్‌కో... దీక్ష విరమించిన శాస్త్రి

పిఠాపురం టౌన్, నవంబరు 27 (న్యూస్‌టుడే): అధికంగా వచ్చిన విద్యుత్తు బిల్లును తగ్గించాలంటూ పిఠాపురం పట్టణానికి చెందిన ఎం.ఎస్.ఎన్.శాస్త్రి(బాంబు) గత మూడురోజుల

## ఎమ్మెల్యేల మద్దతుతో సమస్య పరిష్కారం

నుంచి చేస్తున్న నిరవధిక నిరాహారదీక్ష ఎటువంటి బిల్లు కట్టకుండానే కనెక్షన్ పునరుద్ధరించేందుకు ట్రాన్స్‌కో అధికారులు అంగీకరించడంతో శనివారం సాయంత్రానికి విరమించారు. శనివారం ఉదయం నుంచి మాజీ ఎమ్మెల్యే సంగిశెట్టి వీరభద్రరావు, మాజీ మంత్రి కొప్పన మోహనరావు, ఎమ్మెల్యే పెండెం దొరబాబు, మాజీ ఎం.పి. ముద్రగడ పద్మనాభం అనుచరులు లక్ష్మీపతి, మూర్తి, సంగిశెట్టి వెంకటేశ్వరావు, భోగాపురం ఎం.పి.టి.సి. అలుమల్లు విజయకుమార్, పెద్దాపురం ఎమ్మెల్యే తోట గోపాలకృష్ణ దీక్షా శిబిరాన్ని సందర్శించి తమ మద్దతు ప్రకటించారు. ఉదయం పిఠాపురం ఎస్.ఐ. సత్యనారాయణ వచ్చి ఆరోగ్యం సరిగా లేనందున దీక్ష విరమించాలని, లేనిపక్షంలో అరెస్టు చేస్తామని చెప్పడంతో పోలీసులు ఎవరైనా లోపలకు అడుగుపెడితే కిరోసిన్ పోసుకుని నిప్పంటించుకుంటానని శాస్త్రి హెచ్చరించారు. తన ఆరోగ్యం బాగానే ఉందని, ప్రభుత్వ డాక్టర్ తప్పుడు వైద్య నివేదిక ఇచ్చారని అన్నారు. అనంతరం ఎ.పి.ఇ.పి.డి.సి. డి.ఇ. సత్యనారాయణ, ఎ.డి.ఇ. సత్యనారాయణరెడ్డి, ఎ.ఇ. శాస్త్రి, పిఠాపురం సి.ఐ. వెంకటేశ్వరరావు శిబిరాన్ని సందర్శించి ఎమ్మెల్యేలు, మాజీ ఎమ్మెల్యేలతో చర్చలు జరిపారు. ఎమ్మెల్యే తోట గోపాలకృష్ణ ట్రాన్స్‌కో వైఖరిపై తీవ్రంగా ధ్వజమెత్తారు. సుమారు నాలుగుగంటలసేపు వివిధ దఫాలుగా అధికారులు, అఖిలపక్ష రాజకీయ నాయకులు చర్చలు జరిపారు. ఆఖరికి శాస్త్రి ఇంటికి విద్యుత్తు కనెక్షన్ తక్షణమే పునరుద్ధరించాలని, 725 రూపాయల బిల్లు మొత్తం సోమవారం చెల్లిస్తారని ఎమ్మెల్యేలు తోట, పెండెం, మాజీ ఎమ్మెల్యేలు సంగిశెట్టి, కొప్పన చెప్పడంతో అందుకు అధికారులు అంగీకరించారు. వెంటనే శాస్త్రి ఇంటికి విద్యుత్తు కనెక్షన్ ఇచ్చారు. ఎమ్మెల్యే తోట, పెండెం, మాజీ ఎమ్మెల్యేలు కొప్పన, సంగిశెట్టి శిబిరానికి వెళ్ళి శాస్త్రికి నిమ్మరసం ఇచ్చి దీక్షను విరమింపజేశారు.



ట్రాన్స్‌కో వ్యతిరేకంగా ఆమరణ నిరాహార దీక్ష చేపట్టిన శాస్త్రికి నిమ్మరసం ఇచ్చి దీక్ష విరమింపజేస్తున్న పెద్దాపురం ఎమ్మెల్యే తోట గోపాలకృష్ణ. పిఠాపురం ఎమ్మెల్యే పెండెం దొరబాబు, మాజీ ఎమ్మెల్యేలు సంగిశెట్టి వీరభద్రరావు, కొప్పన మోహనరావు తదితరులు చిత్రంలో ఉన్నారు.

# బాంబు మహాప్రస్థానం, అవయవదానం, సంతాప సమావేశాలకు సంబంధించిన చిత్రాలు

## సీనియర్ జర్నలిస్టు బాంబు మృతి

పిఠాపురం, ఫిబ్రవరి 28, ఈవేళ న్యూస్: సీనియర్ జర్నలిస్టు మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు 68) గుండెపోటుతో మృతిచెందారు. స్థానిక సీతయ్యగారి తోటలోని ఆయన నివాసంలో సోమవరం ఉదయం 5 గంటల సమయంలో తుదిశ్వాస విడిచారు. ఆయనకు భార్య, ముగ్గురు కుమార్లు ఉన్నారు. గతంలో విజయవాడ కేంద్రంగా దశరథరామ్ సంపాదకత్వంలో వెలువడే ఎన్ కౌంటర్ లో జర్నలిస్టుగా పనిచేశారు. ఆయన కలం నుండి వెలువడే అనేక పరిశోధనాత్మక కథనాలు చర్చనీయాంశంగానూ, సంచలనంగానూ ఉండేవి. ముమ్మిడివరం బాలయోగిపై రాసిన ధారావాహిక కథనాలు బాంబుకు మంచి గుర్తింపు తెచ్చాయి. నాదెండ్ల భాస్కరరావు స్థాపించిన ప్రజాస్వామ్య తెలుగుదేశం పార్టీ తరఫున పిఠాపురం నుండి శాసనసభకు పోటీచేసి ఓటమి చవిచూశారు. ఆల్ ఇండియా బ్రాహ్మణ ఫెడరేషన్ (ఏబిబిఎఫ్) కార్యదర్శిగా బ్రాహ్మణ సంక్షేమానికి కృషిచేశారు. బాంబు మృతికి పలువురు ప్రముఖులు, పట్టణ వాసులు తీవ్ర సంతాపాన్ని వ్యక్తం చేశారు. కాగా బాంబు సూచించిన విధంగా ఆయన భౌతికకాయాన్ని వైద్య విద్యార్థుల ఉపయోగార్థం మెడికల్ వైద్య కళాశాలకు అప్పగించనున్నట్టు తెలిపింది.

కోస్తా సమయం

# దేహ దానానికి ముందుకు రావాలి

రాజమహేంద్రవరం, మార్చి 02 (కోస్తా సమయం) : "అవయవ దానంవల్ల పరిమిత సంఖ్యలో కొంతమంది అవసరార్థులు మాత్రమే లాభపడతారు, గానీ, ఒక వ్యక్తి నిర్జీవదేహం కొన్ని వందల వైద్యవిద్యార్థులు శరీరశాస్త్రాన్ని అర్థం చేసుకోవడానికి తద్వారా అనేక వేల లక్షల మంది రోగులను జీవింపజేయడానికి ఉపయోగపడుతుందని అందువల్ల మనం చేసే అవయవ దానం కన్నా దేహదానం మరింత ఉపయుక్తమని జన విజ్ఞాన వేదిక జిల్లా మాజీ అధ్యక్షులు డా॥ బి.చైతన్య శేఖర్ అన్నారు. గుండెపోటుతో మృతి చెందిన సీనియర్ జర్నలిస్టు మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) నిర్జీవ దేహాన్ని రాజమండ్రి జియస్ఎల్ మెడికల్ కాలేజికి అందచేసిన సందర్భంగా జరిగిన కార్యక్రమంలో ఆయన మాట్లాడారు. శరీర శాస్త్రాన్ని అర్థం చేసుకోవడానికి మానవ నిర్జీవ దేహాలు లభించని తొలి రోజుల్లో అనాటమీ పితామహుడు డా. వెసాలియస్ శ్మశానాలకు వెళ్లి, రహస్యంగా నిర్జీవ దేహాలను ఓపెన్ చేసి, ఆయా శరీర భాగ స్వరూప స్వభావాలను అంచనా వేసేందుకు, అధ్యయనం చేసేందుకు సాహసంతో కూడిన కృషి సల్పారని గుర్తు చేసుకొంటూ దేహదానానికి ముందుకు రావాల్సిందిగా అభ్యుదయవాదులకు ఆయన పిలుపునిచ్చారు. మేక సత్యనాయణ శాస్త్రి పత్రికా రంగంలో ఆయన చేసిన కృషిని, జిల్లాలోనూ, రాష్ట్రవ్యాప్తంగాను ఆయన చేసిన అనేక ఉద్యమాలను తద్వారా ఆయన ఎదుర్కొన్న సవాళ్ళను కోర్టు కేసులను గుర్తు చేసుకొని పత్రికా రంగంలోనూ, ప్రజాఉద్యమంలోను అలాంటి చిత్తశుద్ధి తెగువ ఉన్న వ్యక్తులు చాలా అరుదుగా ఉంటారని ప్రజాపత్రిక గౌరవ సంపాదకులు సుదర్శన్ కొనియాడారు. జర్నలిస్టు రవికాంత్ మాట్లాడుతూ "సత్యనాయణ శాస్త్రి చేసిన వీరోచిత ఉద్యమాలవల్ల ఆయన అభిమానులతోపాటు ప్రత్యర్థులు కూడా ఆయన్ను 'బాంబు'గా పిలిచేవారని పిఠాపురంలో ఓ మతిస్థిమితం లేని వాన్ని తెచ్చి 'గోపాల్ బాబా' పేరు పెట్టి ఆ బాబా చుట్టూ చేరిన ధర్మకర్తల మోసాలను, ద్రాక్షారామం భీమేశ్వరాలయంలో పూజారులు చేసే మోసాలను బయట పెట్టినందున ఆయనతోపాటు తాము కూడా కోర్టు కేసులు ఎదుర్కొన్న వైనాన్ని గుర్తుచేసుకున్నారు. నాలుగు దశాబ్దాల క్రితం ఎన్కౌంటర్ ఎడిటర్ దశరథరామ్ ప్రచురించిన 'బాలయోగి బండారం' వెనుక మేక సత్యనారాయణ శాస్త్రిచేసిన పరిశోధనాత్మక జర్నలిజం కృషి ఎంతో ఉందని తెలియజేసారు. జర్నలిజంలో రాజీపడని తత్వాన్ని గూర్చి ఉదహరిస్తూ – ఆ తదనంతర కాలంలో ఎన్కౌంటర్ ఎడిటర్పైననే 'దశరథ రామ్ బండారం' పేరున పుస్తకాన్ని వెలువరించారని తెలిపారు. ఈ సమావేశంలో వేమగిరి బౌద్ధ ఆరామ నిర్వాహకులు 'మహోదయ (యాజరా ) మాట్లాడుతూ నిబద్ధతతో అనేక సామాజిక ఉద్యమాలు రచనలు చేస్తున్న గౌరవ్కు తండ్రి వియోగం తీరని లోటు అన్నారు. ప్రముఖ అభ్యుదయ న్యాయవాది తోరాటి వసంతరావు, ఎమ్మెస్సెన్ శాస్త్రితో తమకున్న పరిచయాన్ని గుర్తు చేసుకొంటూ... ఆయనకు ఇప్పటి వరకు కనీసం బాంక్ అకౌంట్ కూడా లేని నిస్వార్థాన్ని కొనియాడారు. బుక్ సొసైటీ నిర్వాహకులు జార్జి ప్రసాద్, పాతగొలుసు సురేష్, ఎల్ఐసి ఆఫీసర్ రాజ్కుమార్, కంచర్ల నిశాంత్, అవినాష్లు మరియు మాకా రాజేంద్రన్, మేక రోహిత్, మేక తేజ ప్రవీణ్, గౌరవ్ మిత్ర బృందం, కుటుంబ సభ్యులు పాల్గొన్నారు.

AMMA EYE, ORGAN & BODY DONATION PROMOTERS' ORGANIZATION

| Founder & President | Honorary President | General Secretary | Treasurer |
| --- | --- | --- | --- |
| GANJI ESWARA LINGAM | Gutta Jyothsna | B.V.K. Kishor | D.L. Krishna Chand |

## LETTER OF APPRECIATION

DATE:01-03-2022
HYDERABAD

To

MEKA GOURAV
PETAPURAM,
EAST GODAVARI DIST,
ANDHRA PRADESH.

Respected Sir

First of all we convey our heartfelt condolences to you and your family members for the sad demise of Sri.MEKA SATYA NARAYANA SASTRI who expired on 28-02-2022. We appreciate you for donating the Eyes of your beloved FATHER to Badam Bala Krishna Eye Bank,Kakinada and Body was donated to GSL Medical College, Rajamundry, Andhra Pradesh State. The Eyes collected from your father may bring Two Corneal blind persons from darkness to light. The body may be used for benefit of the medical students and researchers. Your family has done a good job for the noble cause of the society.

We once again thank you and your family members for donating Eyes and Body for the benefit of society and we are of the opinion that you may stand as a role model for the future generations.

Co operation with MEKA GOURAV garu, donor son.

With regards

G. ESWARALINGAM
Founder & President
Amma Eye,Organ & Body Donation Promoters' Organization
Regd.No. 111/2016,Hyderabad
Cell : 9493814940

## నేత్రదాన, దేహదాన పత్రం

1. మా ఇద్దరి మరణానంతరం మా దేహాలని ఏ పురోహితులూ, మతాధికారులు తాకరాదు. మా మరణాన్ని గొప్పగా ప్రచారం చేయరాదు.
2. మా ఇరువురి మరణానంతరం మా దేహాలకి ఏ కుల మత ప్రాంత వర్గ లింగ సంప్రదాయాలని వర్తింపజేయరాదు.
3. మా నేత్రాలను నలుగురు అంధులకు చూపును ఇచ్చే విధంగానూ, శరీరాల్ని భావి వైద్యుల శిక్షణకి ఉపయోగపడేలా ఏదేని వైద్యవిద్యా కళాశాలకి ఇవ్వవలెను.
4. కులమతవర్గ లింగ ప్రాంత భేదాలు లేని లౌకికవాదులు, నిరీశ్వరవాదులు, మానవ వాదుల ఆధ్వర్యంలో అత్యంత నిరాడంబరంగా ఈ కార్యక్రమాలు జరిగితే సంతోషం.
5. మరణానంతరం మా పుస్తకాలు ఏదేని ప్రభుత్వ గ్రంథాలయానికీ, మా దుస్తులు, సొమ్ములు, ఇతరేతర సామానులు సమీపంలోని నిమ్న కులస్థులయిన నిరుపేదలకి మాత్రమే ఇవ్వాలి.
6. కులస్థులకు, కుటుంబ సభ్యులకు, మతస్థులకు, మతానుయాయులకు మా భావాల పై గానీ దేహాల పై గానీ ఎటువంటి హక్కు లేదు.
7. ముఖ్యంగా, సొంత కులస్థులు ఎట్టి పరిస్థితుల్లోనూ కుల సాంప్రదాయాల్ని మా దేహాలపై రుద్దరాదు.
8. ఈ దేశంలోని కులతత్వం, మతతత్వం, లింగ వివక్ష అసమానతలు మా ప్రధాన శత్రువులు. కాన వాటికి సంబంధించిన ఏ చిహ్నమూ మా మరణానంతరం దేహాల దగ్గర ఉండరాదు.
9. మా మరణానంతరం ఏ కులమతాలకి చెందిన తంతులూ చేయరాదు. సంస్మరణ సమావేశాలు జరిగితే కచ్చితంగా అవి మానవీయ వైజ్ఞానిక స్పృహతో జరపాలి.
10. స్వర్గం అనేది ఎంత శక్తివంతమైనదైనా మా భావాలకి వ్యతిరేకం. మానవతావాదం ఏ రూపంలో ఉన్నప్పటికీ మాకు శిరోధార్యం. మానవతే మా మతం, అసహాయుల పక్షమే మా అభిమతం.
11. సంస్మరణ కార్యక్రమంలో భోజనాలు కనుక పెట్టదలిస్తే కచ్చితంగా అందులో శాఖాహారంతో పాటూ మాంసాహారం కూడా ఉండాలి.
12. ఆదర్శాలు, విలువలకే కానీ ఆస్తులు అంతస్తులకి మేం వారసులం కాదు. కాన మా అభిప్రాయాలు, ఆలోచనల గురించిన వర్తక వ్యవస్థలో కాసింత చోటు కల్పించడమే మేము మీ నుండి ఆశించే ఆదరణ.
13. దోపిడీ, పీడన లేని సమసమాజం మా ఇరువురి ఉమ్మడి స్వప్నం, అంతిమ లక్ష్యం. కాన, మా పేరుతో జరిగే ఏ పనైనా అందుకు అనుగుణంగానే ఉండాలి కాని విరుద్ధంగా కారాదేది మా అభిప్రాయం.
14. చివరగా మా మరణానంతరం మాకు సంబంధించి ఏ కార్యక్రమం నిర్వహించినా అందులో అణగారిన అట్టడుగు వర్గాల ప్రజలు, ముఖ్యంగా ముస్లింలు షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు, బహుజన మహిళలు, భిన్న లైంగికత గల వారి సంక్షేమానికి కట్టుబడి ఉండటం ప్రధానం.

ఇది మేము పూర్తి ఆరోగ్యంతో, స్పృహతో రాసుకున్న మా దేహదానానికి సంబంధించిన వీలునామా పత్రం.

ఇట్లు
మేకా కృష్ణ గౌరవ్
వేమన శివదుర్గ కళ్యాణి

G.S.L MEDICAL COLLEGE &
G.S.L GENERAL HOSPITAL
(Promoted by G.S.L. Educational Society, Regd. No. 540/1996)

Date: 04.03.2022
Rajahmundry

To
Meka Gourav,
Pitapuram,
East Godavari Dist.
Andhra Pradesh.

Sub: Acknowledgement of appreciation the noble donation of physical body of **Sri. MEKA SATYANARAYANA SASTRI** - Reg.

Respected sir,

We convey of our heartfelt condolences to you and your family members for the sad demise of **Sri. MEKA SATYANARAYANA SASTRI** who expired on 28-02-2022 from the family of GSL GROUP OF INSTITUTIONS. We appreciate your benevolent gesture of donating your beloved father "**physical body**" which will help our institution and the medical students. Our students will acquire gainful knowledge. This will enable our researches to study further.

Your divine decision will go a long way in nurturing the future medical needs of the community by opening new frontier of knowledge. Many people may be inspired by your initiative and path.

We once again thank you and your family members for donating your father physical body for the benefit of community and society.

With regards,

Signature of Principal
GSL Medical College
Rajahmundry
Cell.No: 9849399018

Signature of Professor & Head
Department of Anatomy
GSL Medical College
Rajahmundry
Cell.No.9441256272 & 8919360111
4/3/2022

**Dr. C.K. LAKSHMI DEVI**
**Professor & HOD**
**Department of Anatony**
**GSL Medical College**
**RAJAHMUNDRY-533296.**

Regd. Office: ... RAJAMAHENDRAVARAM - 533 296. A.P.

# మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు)కి నివాళులు అర్పించిన కొద్దిమంది బంధుమిత్రులు

- పెనుమల్లు శ్రీనివాస రెడ్డి, రత్నం (మల్లవరం)
- సుంకర సుబ్బారావు
- దొడ్డి ఈశ్వరరావు
- ముమ్మిడి శ్రీనివాస రావు (కిబిక్ శ్రీను)
- కొత్తెం ఏసు వెంకట రత్నం,మంగరాజు
- శరభ కుమార్,నీలిమ
- గుబ్బల శ్రీనివాస =రావు
- కూసుమంచి యస్.వి.సుబ్రహ్మణ్యం, రాజేశ్వరి(మణిగారు)
- పూడిపెద్ధి పార్వతీశం (చినమావయ్య),కుమారి
- ద్విభాశ్యం సుబ్రహ్మణ్యం (అగ్గి మావయ్య)
- చెరుకుపల్లి శ్రీవల్లి సుబ్రహ్మణ్య వర ప్రసాద శర్మ (చిట్టి బాబు)
- శకినాల అప్పలస్వామి (తాతేలు గారు), గని రత్నం
- చెక్కా నానాజీ
- తాత మోహన్, జయ
- గాంటిమహాపాతుల శ్రీనివాస్,సుజాత
- కొల్లూరు రమణ మూర్తి,జానకి,సుధీర్
- చిట్టెళ్ళ భోజరాజు, లక్ష్మి
- చిట్టెల్ల శ్యామ్, ప్రసన్న
- మూల శ్రీనివాస్, ఉమ
- వేదుల అమల
- వేదుల సునీల్, సుధ
- కందాల అశోక్, మణి
- కందాల పెద్ద సాయి,దొడ్డ, ఆదిత్య, మణిమాల
- కందాల చినసాయి,క్రాంతి
- అన్నపూర్ణ అత్త,మావయ్య
- చిట్టేళ్ళ ఫ్యామిలీ
- చల్లా సుభ్రమణ్యం(పేరవరం)
- ఆర్తమూరి మోజేష్
- సాగి వెంకట్రావు,దుర్గ
- ఏ.మోహన్, భువనేశ్వరి (మోహన్ అంకుల్)
- వడ్డాది గోపి అంకుల్, ప్రసన్న ఆంటీ
- కొల్లూరి త్రినాధ్
- కొప్పల్లి జగన్నాధం
- గున్నం రామకృష్ణ,మైథిలి
- ఏ.దిలీప్,సి.ప్రశాంత్,
- ఏ.వి.రమణ,
- యస్. ఎమ్.హేమంత్,
- మహంతి హేమ సుందర్(సాయి)
- జి.యం.సతీష్,లక్ష్మి
- కె. శరణ్ కుమార్
- జ్యోతుల శివ కుమార్

- చెల్లుబోయిన బాలకృష్ణ
- చెల్లుబోయిన సతీష్
- ఏ.వెంకన్నదొర
- ఏ.విజయ్ కుమార్
- నడిగట్ల పద్మరాజు
- మహ్మద్ కరీముల్ల
- అడ్డాల రాజు
- ఏకా కిషోర్
- తిప్పరాని నాగార్జున
- వాసు
- దాసరి సురేష్
- అర్జున్
- షేక్.మస్తాన్
- కె. శాంతరావు
- కోడూరి శ్రీరామ మూర్తి
- జాషువా
- మహోదయ యజర
- తాతారావు
- గోపు చంద్రరావు
- సూర్యవంశీ
- భాస్కర్
- ఎం.జాషువా
- కోడూరి శ్రీరామమూర్తి
- రావెల సోమయ్య, అరుణ
- దాడి గంగాధర రావు
- డాక్టర్ చైతన్య శేఖర్
- డాక్టర్ చల్లా రవి కుమార్(మండపేట)
- నక్కా సూర్య నారాయణ
- చిన్నారి సతీష్, పావని
- నానిబాబు (గొల్లప్రోలు)
- నంద్యాల అమర్ (వికారాబాద్)
- ఆకుమర్తి రవి
- పి.డి.ఎస్.యు. సిద్దు
- కె.శ్రీకృష్ణ సాయి
- జి.ఈశ్వరరావు
- కె.ఎం.ఎం.ఆర్.ప్రసాద్
- సి. సి.ఆర్. టి.ప్రసాద్
- కొమ్మనాపల్లి అప్పారావు
- అడబాల హరి
- పి.కృష్ణ
- సుబ్బారావు మాస్టారు, అన్నపూర్ణ
- అవసరాల నాగేశ్వరరావు, కామేశ్వరి
- కాల్లురి వేణు
- తోట గౌరీ శంకర్
- జి.లక్ష్మినారాయణ
- జి.శ్రీనివాసు
- యస్. కె.విజయ రంగ
- గుమ్మలూరి కళ్యాణ్ కుమార్, స్వర్ణ లత
- దేవరపల్లి శ్రీను, శారద
- దేవరకొండ లత,శివ
- జ్యోతుల దుర్గా రావు, ప్రభావతి
- మంథా గాయత్రి, వెంకన్న & ఫ్యామిలీ
- మౌళి పురోహిత్
- భమిడిపాటి దత్తు,లక్ష్మి
- కొత్తూరు సాయి,బుజ్జమ్మ
- కుంటముక్కల భాస్కర్
- బంగారు రామకృష్ణ

- లాయర్ ప్రసన్న
- వంగా గీతా విశ్వనాథ్
- లక్ష్మీనారాయణ దత్త (మోకాళ్ళ బాబా)
- దొడ్డి రమణ (వైజాగ్)
- పూడిపెద్ది రామారావు,లక్ష్మి
- నేమాని బాల సుబ్రహ్మణ్యం,లక్ష్మి (తిరుపతి)
- నాళం నాగార్జున
- మేకా ప్రసాదరావు,సుజాత
- మేకా శేఖర్, రమ
- మేకా చలపతిరావు,మంజు
- కంధాల శివ, శ్రీదేవి & ఫ్యామిలీ
- పూడిపెద్ధి వెంకట్రావు,లక్ష్మి (చెన్నై)
- ఆదిరాజు శరత్, విజయ, లచ్చు (చచాయి)
- యణమండ్ర సూర్యనారాయణ
- సాన ప్రసాద్
- చాగంటి విజయ్ కుమార్,అరుణ
- చాగంటి శరత్,స్వప్న
- పీసపాటి శాస్త్రి,విజయ & ఫ్యామిలీ
- మంథా రామసేషు, శాంతి
- కొడుకుల రామకృష్ణ, మణి
- గొల్లపల్లి గణేశ్
- మార్నీడి రంగబాబు
- రామకృష్ణ మాస్టారు
- ప్రసాద్ మాస్టారు
- పడాల రాజ & ఫ్యామిలీ
- రంగనాథ్ అంకుల్ & ఫ్యామిలీ
- ఏ వి ఎన్ ఎస్ కుమార్, మంగమ్మ
- ఆగంటి దుర్గా రావు, పి.మధు, సత్య ప్రసాద్
- మంథా విశాలాక్షి,భగవతి, నాగు,మురళి & ఫ్యామిలీ
- అద్దేపల్లి ప్రభు
- జి. నాగేశ్వరరావు
- ఆచంట విజయ
- పెండ్యాల మల్లేశ్వరరావు
- త్రిమూర్తులు



